# జానపద కథలు

రిజిస్టర్డు 1/64

ప్రచురణ

యువభారతి

సాహితీ సాంస్కృతిక సంస్థ

5 కింగ్స్‌వే, సికింద్రాబాద్

An introduction to folk tales with few illustrations
By DR. G. S. MOHAN

ప్రచురణ సంఖ్య 103

ప్రథమ ముద్రణ

అక్టోబర్, 1984

ప్రతులు 2200

ముఖచిత్ర రచన : శ్రీ శీలా వీర్రాజు

ముఖచిత్ర ముద్రణ:

గీతా ఆర్టు ప్రింటర్స్
కాచిగూడా, హైదరాబాద్

ముద్రణ:

అనూరాధ ఆర్టు ప్రింటర్స్
నారాయణగూడ, హైదరాబాద్

ప్రతులకు: యువభారతి

5 కింగ్స్‌వే, సికింద్రాబాద్-500003

లేదా

యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

వెల: రూ: 4-00

# యువ భారతి పరిచయము

ఉత్తమ అధ్యయనం వల్ల వ్యక్తిత్వానికి సమగ్రత చేకూరుతుంది. సమాజంలో సామరస్యం పెంపొందుతుంది. ఉత్తమభావ ప్రసరణానికి పుస్తకాలు చక్కని సాధనాలు. అందరికీ అందుబాటులో ఉండే విధంగా మంచి పుస్తకాలను అందించే ప్రయత్నానికి యువభారతి పూనుకొని గడచిన ఇరవైఏళ్ళుగా, పాత కొత్తల మేలు కలయికను ప్రాతిపదికగా పెట్టుకొని నూరుపుస్తకాలకు పైగా ప్రచురించింది.

సహృదయుల సహకారంతో పుస్తకాల అమ్మకంవల్ల వస్తున్న ద్రవ్యంతో పుస్తకాలను ప్రచురిస్తూ, తక్కువ వెలకు ఎక్కువ విలువున్న సాహిత్యాన్ని అందించడానికి యువభారతి ఉద్యమిస్తున్నది. ఉత్తమ సాహిత్యప్రచారాన్ని ధ్యేయంగా పెట్టుకొని ప్రచురణలు వెలువరిస్తున్నదేగాని మాసంస్థ వ్యాపార సంస్థ కాదు.

భారతదేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకొనేందుకు ప్రారంభింప బడిన సాహితీ మిత్రపథకంలో 8,500 మంది సహృదయులు చేరి, ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతి భవిష్యనిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వపథకాలలో భారతీయమిత్రులుగా 1100 మంది, భారతీభూషణులుగా 125 మంది చేరారు.

హైదరాబాదు,
డిసెంబరు 7, 1984

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షులు, యువభారతి.

# మా మాట

మాటతోనే పుట్టింది కథ. అనుభవాలను పంచుకోవాలన్న కోరిక పుట్టినప్పుడే పుట్టింది కథ. నాగరకుల కథలకు బీజాలు జానపదుల కథలే. అయితే నగిషీలు ఉండవు. అతిశయోక్తులుండవు. నమ్మకాలుంటాయి. కలలుంటాయి. నాగరకుల్లో కొందరీ కథలను స్వీకరించి తమ పాండితీ విలసనంతో మూలం ఆచూకీ కూడా తెలియకుండా మహాకావ్యాలు రచిస్తారు. ప్రపంచంలోని జానపద కథల్లో సామాన్య లక్షణాలు కొన్ని కనిపిస్తాయి పశుపక్ష్యాదులు పాత్రలుకావడం కనిపిస్తుంది. కథా ఘట్టాలకు వాళ్ళ సంబరాల, శ్రామిక జీవితాల స్పర్శఉంటుంది. భాష చాలా సహజంగా పరిమిత సమాజానికి మాత్రమే ఆస్వాదనీయంగా ఉంటుంది.

డా. జి. ఎస్. మోహన్ జానపద విజ్ఞానాన్ని తలస్పర్శిగా అధ్యయనం చేసినవారు. పరిశోధనా వ్యాసంగంకూడా జానపదుల సాహిత్యానికి సంబంధించిందే. బెంగుళూరు విశ్వవిద్యాలయంలో అధ్యాపకులుగాఉన్న డా॥ మోహన్‌గారు విద్యుత్కుటుంబానికి చెందినవారు. 'జానపద కథలు' అన్న ఈ చిన్నపుస్తకాన్ని వ్రాసి మాకిచ్చి ప్రచురించుకునే అవకాశం కల్పించి తమ ఔదార్యాన్ని చూపినారు. ఈపుస్తకం పరిమాణంలో చిన్నదైనా ప్రయోజనం దృష్ట్యా గుణందృష్ట్యా మిన్న అనిపించుకుంటున్నది.

డా. జి. ఎస్. మోహన్‌గారికి హృదయపూర్వకమైన కృతజ్ఞతాభివందనాలను సమర్పించుకుంటున్నాము.

అక్టోబర్

ఇరివెంటి కృష్ణమూర్తి

# ముందు మాట

ఆంధ్రదేశం సువిశాలమైనది. భౌగోళికంగా ఇది కన్నడం, తమిళం, మలయాళం, మరాఠీ, ఉర్దూ భాషల సంపర్కం పొందింది. అందువల్లనే తెలుగులో ప్రాంతీయ ప్రభేదాలు బాగా కానవస్తాయి. ఈ ప్రాంతీయ భేదాల్లో ప్రధానంగా కన్పించే వ్యత్యాసం ఉచ్చారణలో స్పష్టంగా కన్పిస్తుంది. ఆయా ప్రాంతాల పలుకుబళ్ళు, శైలి, వాక్యరచనా విధానం భిన్నంగా ఉండడం మనం గమనిస్తునే ఉన్నాం. జానపద కథల్లో భాషావైవిధ్యంతో కూడుకున్న ఈ అంశాలన్నీ కన్పిస్తాయి కనుక ఈ వ్యత్యాసాలను పరిచయం చేసుకోవడం అవసరం. జానపద కథా సామగ్రి భాషాశాస్త్రజ్ఞులకు కావలసినంత సమాచారం అందిస్తుంది. అందుకనే నేను రాయలసీమ, సర్కారు ప్రాంతాల్లో ప్రచారంలో ఉన్న కథలనే కాకుండా ఆంధ్రరాష్ట్ర సరిహద్దు ప్రాంతాలలోని కథలను కూడా సేకరించాను. ఈ తెలుగు జానపద కథలన్నీ అనుబంధంగా చేర్చబడ్డాయి.

కోలారు ప్రాంతపు జానపద కథను శ్రీ కె. పి. భట్ గారూ (ఉపన్యాసకులు, కన్నడ విభాగం, బెంగుళూరు విశ్వవిద్యాలయం) హోసూరు ప్రాంతపు జానపద కథలని శ్రీ కె. సీతారామయ్యగారు (నా దగ్గర పి. హెచ్. డి. చేస్తున్నారు), సర్కారు ప్రాంతంలోని తణుకు తాలూకాకు చెందిన జానపద కథను మిత్రులు శ్రీ వి. వై. వి. సోమయాజిగారు (ఉపాధ్యాయులు, తణుకు), రాయలసీమలోని చిత్తూరు జిల్లాకు సంబంధించిన కథలను శ్రీ టి. నారాయణ (నా దగ్గర పి. హెచ్. డి. చేస్తున్నారు) సేకరించి ఇచ్చారు, సేకరించి ఇచ్చిన పై మిత్రులందరికీ కృతజ్ఞతలు సమర్పించుకొంటున్నాను. శ్రీ శాంతి నారాయణ గారు (ఉపన్యాసకులు, ప్రభుత్వ జూనియర్ కళాశాల రాయదుర్గం) అనంతపురం జిల్లాకు సంబంధించిన జానపద కథలని సేకరించి ఇచ్చారు. కాని స్థలాభావం వల్ల వీటిని పేర్కొనడం జరగలేదు. ఈ జానపద కథలను చెప్పిన జానపదులకు ఋణపడి ఉన్నాను. ఈ కథలను పొల్లుపోకుండా యథాతథంగా వారి మాటల్లోనే మీకు అందిస్తున్నాను. తెలుగు జానపద కథలను కూర్చిన (వివరణ, సేకరణ) పుస్తకం ఇంతవరకు తెలుగులో ప్రచురింప బడలేదనే చెప్పాలి. జానపద కథల పరిశీలనకు ఇది కొంతవరకైనా సహకరిస్తుందని నాదృఢ విశ్వాసం.

బెంగుళూరు విశ్వవిద్యాలయం

డా॥ జి. యస్. మోహన్




# యువ భారతి

## "భారతీభూషణ" సభ్యత్వ పథకం

వదాన్యులయిన సాహితీ బంధువులు తమసహాయ సహకారాలను పెద్ద మొత్తంలో అందించి యువభారతి కార్యక్రమాలకు ఊపిరిని, ఉత్సాహాన్ని అందించి, ప్రోత్సహించేందుకు యువభారతి "భారతీ భూషణ" పథకాన్ని ప్రారంభించింది.

భారతీ భూషణులు కావాలంటే :

రూ॥ 1,116/-లు గాని అంతకు మించిగాని, మొత్తాన్ని ఒకేసారి లేక పదిసమాన వాయిదాలలో అందించిన వారిని "భారతీభూషణు"గా సమాదరిస్తుంది.

ఇలా పెద్దమొత్తంలో విరాళ మిచ్చిన "భారతీభూషణుల"కు

- సభ్యత్వం పూర్తిగా చెల్లించిన వెంటనే "భారతీ భూషణ గుర్తింపు ఫలకం అందజేయ బడుతుంది.
- యువభారతి కార్యక్రమాల గురించి అన్ని వివరాలూ ఎప్పటి కప్పుడు తెలియ జేయడం జరుగుతుంది.
- యువభారతి వెలువరించే అన్ని ప్రచురణలనూ, భారత దేశంలో ఎక్కడ ఉన్నా సరే శాశ్వతంగా ఉచితంగా అందించటం జరుగుతుంది. గమనిక :- విదేశాలలో ఉండే భారతీభూషణులు పోస్టు ఖర్చులు తామే భరించాలి.
- యువభారతి ఉపన్యాస కార్యక్రమాలలో మీరు ప్రత్యేక ఆహ్వానితులుగా పాల్గొన వచ్చును.

మా స్నేహాహ్వానాన్ని స్వీకరించండి! భారతీమిత్రులుగా, భారతీ భూషణులుగా చేరండి!

యువభారతి సుస్థిర భవిష్యత్ కార్యక్రమాలకు మీచేయూత నందించండి.

## యువభారతి భారతీమిత్ర పథకం :-

ప్రతి సంవత్సరం రూ॥ 10/- చందా చెల్లించి సాహితీమిత్రులుగా పరిగణింపబడేకంటే, ఒకేసారి "నూటపదహార్లు" అందించి శాశ్వత సభ్యులుగా చేరి యావజ్జీవితం యువభారతి నుండి సదుపాయాలను అందుకో గలరనే ఉద్దేశ్యంతో రూపొందింపబడినదే "భారతీమిత్ర" సభ్యత్వ పథకం.

**భారతీ మిత్రులు కావాలంటే :-**

- కేవలం రూ॥ 116/-లు చెల్లించటంతో మీరు శాశ్వతంగా యువభారతి "భారతీమిత్రులు"గా పరిగణింపబడతారు. పై మొత్తాన్ని ఒకేసారి చెల్లిస్తే మంచిది.
- ఒకేసారి రూ॥ 116/-లు చెల్లించకపోతే మొదటి వాయిదాగా రూ॥ 16/-లు చెల్లించి మిగిలిన మొత్తాన్ని నెలకు రూ॥ 10/-ల చొ॥న పది సమానమైన వాయిదాలలో చెల్లించవచ్చు.
- మొదటి వాయిదా రూ॥ 16/-లు చెల్లించగానే మీకు "భారతీమిత్ర" సభ్యత్వ సంఖ్య కేటాయించబడుతుంది. యువభారతి ప్రచురణల నుండి మీరు ఎన్నుకొన్న రూ॥ 12/-ల విలువగల పుస్తకాలను అందుకుంటారు.
- మొత్తం రూ॥ 116/-లు చెల్లించిన వారు మాత్రమే యువభారతి "భారతీ మిత్రులుగా" గా పరిగణింప బడతారు.

**పూర్తి సభ్యత్వం చెల్లించి భారతీమిత్రులయితే మీకు:**

- "భారతీమిత్ర" గుర్తింపకార్డు అందజేయబడుతుంది
- ప్రతి సంవత్సరము రూ॥ 12/-ల విలువగల యువభారతి ప్రచురణలు (ప్రచురణలపై పేర్కొన్న వెల ప్రకారం) జీవిత పర్యంతం అందజేయబడతాయి.

గమనిక : పుస్తకాలు పోస్టులో పొందగోరే మిత్రులకు రూ॥ 12/-ల విలువ గల పుస్తకాలను పోస్టేజిమేరకు అంటే దాదాపు రు 2-00 లకు వి. పి. పి. లో పంపించడం జరుగుతుంది. మిత్రులు ఆ మొత్తాన్ని చెల్లించి తమ భారతీ మిత్ర సభ్యత్వ పుస్తకాలను విడిపించుకోమని మనవి. పుస్తకాలు మిత్రులకు భద్రంగా చేరేందుకు వీలుగా ఈ చిన్నమార్పు చేయడం జరిగింది. స్థానికేతరులైన భారతీ మిత్రులు దీనిని గమనించి సహకరించ ప్రార్థన.

- యువభారతి ప్రచురణల నన్నింటినీ 30శాతం మినహాయింపుతో మీ సొంతం చేసుకొనే సదుపాయాన్ని శాశ్వతంగా పొందవచ్చు. పోస్టేజీ అదనం అని గమనించండి.

# యువ భారతి సాహితీ లహరి నిధి

కడచిన ఇరవై ఒక్క ఏళ్ళుగా సాగుతున్న సాహిత్య కృషి నిరంతరం కొనసాగాలని సాహిత్య లహరి ఉపన్యాస పరంపర అవిచ్ఛిన్నంగా సాగాలని ఆశిస్తూ యువభారతి "భారతీ భూషణులై"న **శ్రీ పిండిప్రోలి కామేశ్వరరావుగారు** రూ 10 వేల నిధిని యువభారతికి సమకూర్చటానికి దయతో ఉద్యమించినారు.

ఉదారులైన దాతలు ఇలా భూరి విరాళాలనిచ్చి యువభారతి సదాశయసిద్ధికి తోడ్పడగలరని ఆశిస్తున్నాము.

మీ అభిమానమే శ్రీరామరక్షగా కొనసాగే యీ కృషికి మీ ఆర్థిక హార్దిక ప్రోత్సాహాన్ని అందించాలని విన్నవిస్తూ—

**యువభారతి**

# జానపద కథలు

తాతయ్యా! కథ చెప్పవూ, అమ్మమ్మా ఆ కథ చెప్పవే!, నాయనమ్మా! ఆ కథ బాగులేదు, మరోకథ చెప్పవూ అంటూ పండు ముదుసలుల్ని వేధించుకు తినే పిల్లల్ని మనం చూస్తూనే ఉంటాం. కథ రుచిమరిగిన పిల్లలు రాత్రి పడుకునేటప్పుడు చేసే అల్లరి అంతా ఇంతా కాదు. వయసు మళ్ళిన వాళ్ళకూ, పిల్లలకూ ఉన్న నేస్తం మరెవ్వరితోను ఉండదు కదా!

కథ అంటే చెవి కోసు కొనేది పిల్లలే అని మనం అనుకుంటూ ఉంటాం. ఇది పొరపాటు మాటనేర్చుకుంటున్న పసికందు మొదలుకొని ముసలివాళ్ళ దాకా కుతూహలాన్ని రేకెత్తిస్తుంది కథ. అందుకనే కథ మనస్సుని రంజింపచేసే ఒక ప్రక్రియగా తయారైంది.

ప్రాచీన కాలంలో వేటాడటం ఒక వినోదం మాత్రమే కాదు. వేటాడిన జంతువులే ఆదిమవాసుల నిత్యజీవనాధారంగా ఉండేవి. వేటాడటం, అలాగే పోవడం, మళ్ళీ గూడు చేరుకోవటం - ఇవ్వన్నీ మామూలే. అయితే వేటలో తాము పొందిన అనుభవాల్ని నలుగురూ ఒకచోటచేరి చెప్పుకోవడం జరిగి ఉంటుంది. తమ అనుభవాలకు మరికొంత మెరుగులు దిద్ది, ఉన్నవీ, లేనివీ కల్పించి కూడ చెప్పుకొని ఉండొచ్చు. ఇవే క్రమంగా కథల్లా, కట్టుకథల్లా అల్లుకు పోయాయనిపిస్తుంది. ఒక్క వేటకు సంబంధించిన విషయాలనూ, అనుభవాలనేకాదు, తాము విన్నవీ, కన్నవీ కథల్లా అల్లుకొని ఉంటారు. ఇవన్నీ ఉబుసుపోకకూ, వినోదానికీ చెప్పుకొన్న కథలుగా మనం పరిగణించాలి.

కథల్ని సాధారణంగా సాయం సమయాల్లో చెప్పుకోవడం పరిపాటి. లేదా రాత్రివేళల్లో భోజనానంతరం తీరిగ్గా ఆరుబయల్లో కూర్చొని చెప్పడం జరుగుతూ ఉంటుంది. నగరవాసులు తమకు కావలసిన వినోదాలను అనుభవించ గలుగుతారు. పల్లెల్లో ఇది సాధ్యం కాని పని. పొద్దస్తమానం కష్టపడి కూలి గింజలు తెచ్చుకొని ఇల్లు చేరుకొనే పల్లీయులకు కథలుచెప్పుకోవడమో, పాటలు పాడుకోవడమో, బయలాటలు ఆడుకోవడమో ఒక గొప్పవినోదం. కథను చెప్పేవారు మంచి మాటకారిగానూ, నలుగురినీ ఆకట్టుకొనే వాడుగానూ

ఉంటాడు. అందువల్లనే నలుగురూ అతని చుట్టూ చేరి ఉత్సాహంగా కథల్ని విని ఆనందిస్తారు.

'కథకు కాళ్ళు లేవనీ', 'కథ కంచికి మనమింటికి' అని ప్రచారంలో ఉన్న ఈ మాటలో కథల ప్రాచుర్యాన్ని తెలియ జేస్తాయి. సాధారణంగా జానపద కథలు 'అనగనగా ఒక రాజు', 'ఒకానొక కాలంలో' 'పూర్వకాలంలో'' 'ఒక ఊళ్ళో' అన్నమాటల్తో ప్రారంభమై 'వాళ్ళు సుఖంగా కాలం గడిపారు. అన్న మాటల్తో ముగుస్తాయి.

ప్రపంచంలో ఏ మారుమూల ప్రాంతానికి వెళ్ళినా జానపద కథలను చెప్పేవాళ్ళు, వినేవాళ్ళు అధిక సంఖ్యల్లో కన్పిస్తారు. అందులోనూ భారతదేశంలో కథలంటే చెవికోసుకొనే వాళ్ళే అధికం. భారతదేశం జానపద కథలకు పుట్టినిల్లు. కుతూహలాన్ని రేకెత్తిస్తూ కథను చెప్పడం ఒకకళ. ఈకళలో ఆరితేరిన జానపద కథకులు ప్రతి గ్రామంలోనూదర్శనమిస్తారు. కథా కథనం ద్వారా తమకు తాము ఉల్లాసాన్ని పొందడమే కాకుండా, కథలువినేవాళ్ళ హృదయాల్ని రంజింపచేస్తారు జానపద కథకులు. కథచెప్తుంటే ఊ గొట్టడం పరిపాటి. ఈ ఊ గొట్టడమే కథకునికి మరింత ఉత్సాహాన్ని కల్గిస్తుంది.

## కథ అంటే

నివేదించు, ప్రకటించు, ప్రదర్శించు, భావించు, వరించు, వ్యాఖ్యానించు ఇత్యాదిఅర్థాలు కల 'కథ్' మూలధాతూపపన్నం కథ'. 'కథ్యతేయితి కథా'. 'కథ్'-ధాతుజన్యమైనది. కథ అనేవి కథకు సంబంధించిన కొన్ని వివరణలు.

'కథా శబ్దానికి సంభాషణమనే ప్రయోగం మనుస్మృతి లోనూ, మహాభారతంలోనూ, ఆశ్వలాయన గృహ్యాసూత్రాలలోనూ కన్పిస్తాయి. కథ అంటే కల్పిత గాథ అని కావ్యదర్శ సాహిత్యదర్పణాదుల నిగమనం అనీ, చర్చ అనే అర్థంలో కథా శబ్దాన్ని సర్వదర్శన సంగ్రహం ప్రయోగించిందనీ, వివరణ పూర్వాఖ్యానమున్న దృష్టిలో కథాలాపశబ్దాన్ని కథాసరిత్సాగరం వాడుక చేసిందనీ డా॥ తూమాటి దోణప్పగారు తమ 'తెలుగు హరికథా సర్వస్వం' లో వివరించారు. దేవతా పరమైన ఆఖ్యానాన్ని కథలనీ, తదితరుల ప్రసక్తి గల వాటిని 'గాథ' లనీ అంటారట.

'కథ' అంటే వృత్తాంతం. కొన్ని సత్యాంశాలతో కూడుకొన్న కల్పిత కథనం. గేయ రూపకంగా కాక కథన రూపకంగా ఉన్న వచనం. జానపద త్వంతో కూడుకొని సత్యాంశాలతో మేళవించిన, కథన రూపకంగా ఉన్న కల్పిత కథ 'జానపద కథ'.

కథ ఈ నాటిది కాదు. ఏనాటిదో? మనదృష్టిలో మొదట్నుంచీ "కథ"కు "జానపద కథ"కు భేదమేలేదు. మనక్కావలసింది కథ అయితే అన్ని కథల్లోనూ జానపదకథాలక్షణాలు ఉన్నాయని చెప్పలేం. నిజానికి జానపదకథాలక్షణాలేవేరు, వాటిని తర్వాత వివరిస్తాను. ఆంధ్రదేశంలో ఇంతవరకు జానపద కథల సేకరణ కానీ, అధ్యయనం కానీ జరగలేదు. జరగకపోవడం వల్లనే మనకు తెలిసిన కథలన్నీ జానపద కథలనే అపోహకు గురయ్యాం. కొన్నికథలు సంస్కృతం నుంచి అనువాదం చేయబడ్డాయి. మరికొన్ని ఆ నోటా ఈ నోటా విన్న కథలకు తమ స్వంత కవిత్వమూ చేర్చి, అల్లబడ్డ కల్పిత కథలు. ఇవి అనుకరణ కథలు. పోతే నిజమైన జానపద కథలు జానపదుల్లోదాగి ఉన్నాయి. అనువాద కథలూ, అనుకరణకథలూ ఒక విధంగా చదువూ, వ్రాతా వచ్చిన వాళ్ళను ఆధారంగా చేసికొని బయల్దేరి నట్టివైతే జానపదకథలు పల్లెల్లో జానపదులు స్థానికంగానూ, చారిత్రికంగాను తాము విన్న కథల్ని తమ భాషలో తమదే అయిన రీతిలో మలచుకొన్నట్టివి. అనక్షరస్తుల నోళ్ళలో అనేక మార్పులూ, చేర్పులూ చేరి ఇంకా నిలదొక్కుకున్నాయి. అందువల్లనే వాటిని అసలైన జానపద కథలనాలి. ఈ దృష్టితో చూచినప్పుడు మనకు లభిస్తున్న జానపద కథల్ని మూడు తరాలుగా విభజిస్తే సరిపోతుంది.

## 1. అనువాద కథలు

ఉదా: జాతకకథలు (పాలీ భాషనుండి అనువాదితం) భట్టి విక్రమార్కుల కథలు (సంస్కృతం నుండి అనువాదం) కథా సరిత్సాగరం (సంస్కృతంనుండి అనువాదితం)

## 2 అనుకరణ కథలు

ఉదా: కాశీ రామేశ్వర మజిలీ కథలు వీటిని శ్రీ మద్దూరి శ్రీరామమూర్తి గారు రచించారు.

## 3 అసలైన జానపదకథలు

పాట, వచనం- ఈ రెండింటిలో జానపదకథ వచనప్రక్రియకు సంబంధించింది. కేవలం ఆ నోటి నుండి ఈ నోటికి, ఆ చెవి నుండి ఈ చెవికి తరతరాలుగా సంప్రదాయబద్ధంగా అందించబడ్డ కథాకథనమే జానపదకథ ఆంగ్లంలోని "ఫోక్ టేల్" కు ఇది సమానపదం. కొంతమంది దృష్టిలో జానపదకథలోనే జానపదపురాణం జానపదఐతిహ్యం చేర్తాయి. స్టిక్ థాంసన్ దృష్టిలో "సాంప్రదాయిక గద్యకథ" (Traditional prose Narrative) జానపదకథ. "The Story which has been headed down from generation to generation either in writiong or ) by word of month" (The Folktale, 1954 P 4 ఇది విశాలార్థంలో ఉపయోగించబడింది. The Folktale అన్న గ్రంథంలో పురాణం, ఐతిహ్యాలను జానపదకథాప్రక్రియగానే విశ్లేషించారు. సాంప్రదాయిక గద్యకథ అన్నప్పుడు జానపద కథ, పురాణం, ఐతిహ్యాలు మూడు అందులో చేర్తాయి. అయితే జానపద కథ అని ప్రత్యేకంగా చెప్పి నప్పుడు పురాణం, ఐతిహ్యాలను జానపదకథ నుండి వేరు చేయాల్సి ఉంటుంది. జానపదకథకూ, పురాణం, ఐతిహ్యాలను స్వరూపంలోనే వ్యత్యాసం కనిపిస్తుంది. వస్తువును దృష్టిలో పెట్టుకుంటే ఈ మూడింటిలో సమానత కనిపిస్తుంది. అయితే కాలం, స్థలం, వ్యక్తి- ఈ మూడింటిని గమనించి నట్లయితే పురాణం, ఐతిహ్యాలు రెండూ జానపదకథకంటే భిన్నాలని చెప్పొచ్చు. అంతే కాకుండా కథన శైలిలోనూ భిన్నత్వం కనిపిస్తుంది. అయితే ప్రాచీన సమాజాలలో ఈ మూడు అభిన్నాలే అని తోస్తుంది.

### శిష్టకథ జానపదకథ

కథా సాహిత్యంలో రెండురకాలైన సంప్రదాయలను గుర్తించటానికి వీలవుతుంది. అవి 1. శిష్ట కథాసాహిత్యసంప్రదాయం 2. జానపద కథా సాహిత్య సంప్రదాయం. అన్ని జానపద సాహిత్యప్రక్రియల లాగానే ఈ జానపద కథాసాహిత్యప్రక్రియలో కూడ కాలం, రచయితల గురించి నిర్దిష్టంగా చెప్పడం కష్టం. దీనికికారణం వాక్సాంప్రదాయం, శిష్టజానపద కథా సాహిత్యాలు రెండు జనసామాన్యుల కోసమే రచింపబడినట్టివనడంలో

సందేహంలేదు. అయితే శిష్టకథాసాంప్రదాయం కొన్ని నిర్దిష్టమైన ఉద్దేశ్యాలతో కూడుకొని వుంటుంది. నిర్దిష్ట వ్యక్తికి, నిర్దిష్టమైన విషయానికి చెంది వుంటుంది. శిష్టజానపదకథాసాహిత్యాలను వేరుచేయడం ఒక్కోమారు కష్టంతో కూడుకొన్నపనే. ఎంచేతనంటే వస్తువు విషయం తీసుకున్నప్పుడు. పరస్పరం ఇచ్చిపుచ్చుకోవడాల్ని అలరించుకున్నవే. శిష్ట సాహిత్యంలోని అనేక కథలు జానపదకథల్లో చేరిపోవడం, శిష్టకథలు అనేకం జానపదకథల్ని తమలోకి తీసుకొని వృద్ధిచెందడం అనాదిగా జరుగుతూనే ఉంది. ఇది ఒక్క కథాసాహిత్యానికి మాత్రమే పరిమితం కాదు. అన్ని జానపద విజ్ఞాన ప్రకియలకు అన్వయిస్తుంది.

వేద కాలంనాటికే వేదాల్లో జానపద కథా బీజాలు మనకు కనిపిస్తాయి.

రామాయణ, మహాభారత, భాగవతకథల్లో సందర్భానుసారంగా జనుల వాడుకలో ఉన్న జానపద కథలు చేర్చబడ్డాయి.

ఈసప్ నీతి కథలు జానపద కథలను లోగొన్న ఒక ప్రాచీన గ్రంథం. బైబిలు వంటి పవిత్రగ్రంథాల్లోనూ కొన్ని జానపదకథలు చోటు చేసుకొన్నాయి. గుణాఢ్యుడు పైశాచీ భాషలో వ్రాసిన బృహత్కథా గ్రంథం ఒక పెద్ద జానపద కథా సంగ్రహంగా చెప్పొచ్చు. ఆ గ్రంథం సంగ్రహ రూపం క్షేమేంద్రుని బృహత్కథా మంజరిలోను, తమిళంలోని "పెరుంగతై" అనే కథా సంగ్రహంలోను లభిస్తుందట. బృహత్కథలో పశుపక్ష్యాదుల కథలున్నాయి. యక్షిణులు, మూర్ఖులు, వేశ్యలు ఈ కథల్లో చోటు చేసుకున్నారు. తెలివి తేటల్ని పరీక్షించే సమస్యాత్మకకథలు ఇందులో ఉన్నాయి. బృహత్కథని ఒక జానపదకథాకోశంగా పేర్కొన వచ్చునన్న అభిప్రాయం ఉంది.

విష్ణుశర్మ పంచతంత్రకథల్లో జానపదకథలనేకం కనిపిస్తాయి. ఈ కథలు చాలావరకు జనపదాల్లో ప్రచారంలో ఉండిఉంటాయి. వాటిని సమయ సందర్భాలను బట్టి వాడుకొన్నట్టుగా ఆ కథల స్వరూపాలవల్ల తెలుస్తుంది. పదమూడోశతాబ్దంలో పంచతంత్రకథలు లాటిన్, జర్మన్ భాషల్లో అనువాదం కావడం ఒక విశేషం.

బుద్ధుని జాతక కథల్లో పశుపక్ష్యాదులకు సంబంధించిన కథలున్నాయి

సింహాసన ద్వాత్రింశికా, భట్టివిక్రమార్కుని కథలు, భేతాళ పంచవింశతికథలు ప్రాచీన కథా సంకలనాలు. శుకసప్తతి కథల్లో నీతిప్రధానమైన అంశాలు ఉన్నా అశ్లీల విషయాలు కూడ లేక పోలేదు.

అరేబియన్ నైట్సు కథలు ఫ్రెంచి భాషలో అనువదించబడి అనేక దేశాలకు వ్యాపించాయి.

ఐర్లండు దేశపు "సాగా" కథా ప్రక్రియకు భారతదేశంలో ప్రచారంలో ఉన్న విక్రమాదిత్యుని కథల్ని పోల్చ వచ్చునట.

## జానపద కథల లక్షణాలు

ఆక్సెల్ ఓల్రిక్ జానపద కథలకు అన్వయించబడే కొన్నిలక్షణాలను నిర్దేశించాడు. (ది స్టడీ ఆఫ్ ఫోక్‌లోర్ లో, ఆక్సెల్ ఓల్రిక్ గారి వ్యాసం "ఎపిక్ లాస్ ఆఫ్ ఫోక్ నెరేటివ్" మరియు డా॥ ఆర్వియస్ సుందరం గారి జానపద సాహిత్య స్వరూపంలో "గద్య కథనాలు" అన్న వ్యాసం చూడండి.)

"1. ముఖ్యమైన క్రియతో ప్రారంభం కావు. ఉన్నట్టుండి ముగిసి పోవు.

2. పునరావృత్తి సామాన్యంగా అన్నిచోట్లా కన్పిస్తుంది. అదికథకు నిండుదనాన్ని ఇస్తుంది. ఈ పునరావృత్తి ఒక్కొక్కసారి మూడుసార్లు, కొన్ని దేశాలలోని ధార్మిక సంకేతాల కారణంగా నాలుగు సార్లు ఉండవచ్చు.

3. మామూలుగా ఒక్కసారి ఇద్దరు వ్యక్తులు మాత్రం ఒక దృశ్యంలో కనిపిస్తారు. ఇంకా ఎక్కువగా ఉన్నా ఇద్దరుమాత్రం క్రియాశీలురై ఉంటారు.

4. విభిన్న పాత్రల కలయిక కనిపిస్తుంది. ఉదాహరణకు నాయకుడు ప్రతినాయకుడు; శిష్టుడు - దుష్టుడు.

5. ఒకే రకమైన పాత్రలు రెండు ఉంటే, వాళ్ళు చిన్న వాళ్ళుగా కాని లేక అశక్తులుగా కాని చిత్రింప బడతారు. ఒక వేళ శక్తిగలవాళ్ళు అయితే విరోధులయ్యే అవకాశం వుంది.

6. దుర్బలులుగా ఉండేవారు మంచివాళ్ళుగా ఉంటారు. సోదరులలో చిన్నవాళ్ళు మామూలుగా జయం సాధిస్తారు.

7. పాత్రచిత్రణ సరళంగా ఉంటుంది. కథకు నేరుగా సంబంధించినవి మాత్రం చిత్రితమవుతాయి. పాత్రలకు, కథకు అతీతమైనవేవీ కనిపించవు.

8. కథావస్తువు సరళంగా ఉంటుంది. ఏకకాలంలో ఒక్క కథనే వివరించాలి. రెండుగాని, అంతకంటె ఎక్కువగాని కథలు ఏక కాలంలో చెప్పవలసివస్తే అప్పుడు అది సాహిత్యకథను పోలుతుంది.

9. మామూలుగా అన్నీ చాలాసరళంగా ఉంటాయి. వైవిధ్యపూర్ణంగా చేయాలనే ప్రయత్నం కన్పించదు".

## జానపద కథల్లో కన్పించే ప్రధానాంశాలు :

జానపద కథల్లో వాస్తవమైన సంఘటనలకు, వ్యక్తులకు చోటులేకపోయినా జానపదుల సంస్కృతి, నమ్మకాలు - విశ్వాసాలు, సామాజిక జీవితం మతసాంప్రదాయాలు చెప్పబడి వుంటాయి. కొన్ని జానపద కథల్లో మత ప్రాబల్యం అధికంగా కన్పిస్తుంది. ప్రజలు దైవ భక్తితో మెలగడం, వంశ పారంపర్యమైన రాజవంశాల్లో రాజకీయాంశాలు ఎక్కువగా చోటుచేసికొని ఉండడం కన్పిస్తుంది.

భారతదేశపు జానపద కథల్లో యక్షులు, గంధర్వులు, కిన్నెరులు, గుహ్యకులు, రాక్షసులు, విద్యాధరులు, సర్పాలు, భూతప్రేతాలు, పిశాచాలు మొదలైన అలౌకిక శక్తులు చోటుచేసికొని ఉండడం గమనించవచ్చు. పెక్కు జానపద కథల్లో మంత్రగాళ్ళ ప్రాముఖ్యం కన్పిస్తుంది. మంత్ర తంత్రాలు భయాల్ని కల్గించే అంశాలైన ఆయాకాలాల్లో జనులు వాస్తవంగానే అనుభవించి ఉంటారేమోనన్న సందేహానికి దారితీస్తుంది.

అతి మానుష శక్తుల సాధారణ లక్షణాలు ఈ క్రింది విధంగా ఉంటాయి. (చూ. దుర్గాభగవత్‌గారి 'యాన్ ఔట్‌లైన్ ఆఫ్ ఇండియన్ ఫోక్‌లోర్' అనే గ్రంథం)

"1. అతిమానుష శక్తులు, ఐంద్రజాలిక శక్తులను కలిగి ఉంటారు.

2. వాళ్ళు గాలిలో ఎగురుతారు.

3. వాళ్ళు అదృశ్యులు కాగలరు, రూపాన్ని మార్చుకొనగలరు.

4. చిత్రకళ. సంగీత నృత్యాదులలో ఆరితేరిన వారుగా ఉంటారు.

5. మనుష్యులలో లైంగిక సంబంధాన్ని ఏర్పరచు కొంటారు.

6. వీళ్ళకూ, మనుష్యులకూ జనించిన సంతానం మానవులే అవుతారు.

7. కొన్ని సందర్భాలలో కిన్నరులు మినహా మిగిలిన వాళ్ళెవ్వరికీ రెక్కలు వుండవు. విద్యాధరులు, గంధర్వులు తాము మెడలో ధరించే మాయాహారాల ప్రభావం వల్ల గాలిలో ఎగర గలరు.

8. వాళ్ళు పగటి పూట కంటే రాత్రి సమయాల్లోనే సంచరించడానికి ఇష్టపడతారు.

మానవ నాయికా నాయకుల అదృష్టానికి కానీ, దురదృష్టానికి కానీ వీరు సహాయకులుగా ఉంటారు.

పైన పేర్కొన్న వన్నీ అద్భుత కథలకు సంబంధించిన సామాన్య లక్షణాలు. పై లక్షణాలన్నీ రేచుక్క పగటిచుక్క కథలు, విక్రమార్కుని కథలు మొదలైన కథల్లో స్పష్టంగా కన్పిస్తాయి.

జానపద కథల్లో వచ్చే దుష్టపాత్రలనన్నింటిని భయంకరమైన ఆకారాలు కలిగిన రాక్షసులు, భూతాలకు సంకేతాలుగా తీసుకొన్నట్టు ఆయా కథల వల్లనే తెలుస్తుంది, పైకి ఇవి మనకు అసత్యాంశాలుగా కన్పట్టినా ఈ భయంకరాకారాలద్వారా ఆయా పాత్రల క్రూర స్వభావాలు వెల్లడవుతాయి.

జానపద కథల్లో మానవుల సాహసాలే కాకుండా జంతువుల సాహసాలు కూడా వర్ణింపబడి ఉంటాయి. అడవి జంతువుల ద్వారా కూడా మనకు ఆయా పాత్రల స్వరూప స్వభావాలు తెలుస్తాయి. జంతువులు, పక్షులు మానవులకు ఉపకారానికి ప్రత్యుపకారం చేస్తుంటాయి. ఈ ప్రాణికథల నన్నిటిని నీతి కథలుగా చెప్పొచ్చు.

జానపద కథలు ఏయే కాలాల్లో కట్టబడ్డాయో ఆయా కాలాల సామాజిక పద్ధతులు, ఆచారవ్యవహారాలు వాటిలో ప్రతిబింబిస్తాయి. అందువల్లనే ఇవి వాస్తవికతకు దగ్గరలో ఉన్నాయనిపిస్తుంది.

జానపద కథల్లో మనకు కన్పించే మరొకఅంశం హాస్యం. కేవలం

వినోదమే ఇలాంటి కథల్లో అధికంగా కన్పిస్తుంది. ఈ కథల్లో హాస్య ప్రవృత్తే కాకుండా మూర్ఖత్వం తెలివితేటలు తొంగిచూస్తాయి.తెనాలిరామలింగని వృథకథలు మర్యాదరామన్న కథలు హాస్యకథలకు మంచి ఉదాహరణలు.

జానపద కథలు ఐతిహ్యాలలాగా చరిత్రకు సంబంధించినవికావు. పుక్కిటి పురాణాలలాగా కర్మకాండలకూ సంబంధించినవీకావు. ఇవి నిరక్షరకుక్షులైన ప్రజలకల్పనలు. శ్రోతలకు పరిచయమైన సంఘటనలనే ఇవి వర్ణిస్తాయి. జానపద కథల ప్రభావం పిల్లలమీద అధిక ప్రభావాన్ని చూపుతాయి. చిన్నతనంలో విన్నవీ, కన్నవీ, నేర్చినవీ వయసు పెరుగుతున్న కొద్దీవాళ్ళలో చెప్పలేనంత పరిణామాన్ని తెస్తాయి. అనేక కథల్లో మంచివాళ్ళు మొదట్లో కష్టాలనన్నిటినీ ఎదుర్కోవడం, తర్వాత వాటిని జయించడం సాధారణంగా కన్పిస్తుంది. ధైర్యోపాయాలు ఉంటే ఎవరైనా జయించవచ్చునన్న ఆత్మవిశ్వాసాన్ని ఈ కథలు బోధిస్తాయి.

జానపదకథల్లో కన్పించే అనేకాంశాలు ప్రపంచమంతటా ఇంచుమించు ఒకేరీతిలో ఉంటాయి. భిన్నదేశాలకు చెందిన ఈకథల్లోని సామ్యాన్ని బట్టి ఇవి ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి వ్యాపించి ఉంటాయని చెప్పడానికి వీలుంది

## జానపద కథా సిద్ధాంతాలు

జర్మనీదేశపు గ్రిమ్ సోదరులు 1812లో జానపద కథల సంకలనాన్ని ప్రచురించడం మొదలు పెట్టిన కారణంగా జానపద కథాధ్యయనం వైజ్ఞానికంగా సాగడానికి నాంది పలికింది. ఇది తర్వాత ఐరోపా అంతటా జానపద కథా సంగ్రహణం మరియు విశ్లేషణలకి కొత్త పంథాను చూపింది. గ్రిమ్‌సోధరుల. 'Kinder-Und Hausmarchen' అన్న గ్రంథమే ప్రప్రథమ శాస్త్రీయ జానపద కథాసంకలనం. ఇందులో ఉన్న కథలు మౌలికప్రచారంలో ఉన్నవేకాక సాహిత్య సంకలనాల నుంచి కూడ తీసుకొని ఉండడం కన్పిస్తుంది. ఈ కథలు అనతి కాలంలోనే ప్రపంచమంతటా జానపద కథాధ్యయనానికి వస్తువయ్యాయి, పంతొమ్మిదవ శతాబ్దమంతా సంగ్రహకారులకు ప్రేరక శక్తులుగా నిలిచాయి. గ్రిమ్ సోదరుల ఈ కథాసంకలనాన్ని మాదిరిగా పెట్టుకొని డెన్మార్క్, నార్వే

రష్యా, హంగేరి, ఆల్బేనియా, గ్రీస్, ఫ్రాన్స్, రష్యా మొదలైన దేశాల్లోని తమ తమ దేశాల్లో మొట్టమొదటి కథాసంకలనాలను తీసుకుని వచ్చారు.

కథల విషయంలో గ్రిమ్ సోదరుల అభిప్రాయలు 1856లో సిద్ధాంతాలుగా రూపుదిద్దుకొన్నాయి. అన్ని జానపదకథలు ఇండోయూరోపీయన్ భాషలను మాట్లాడే ప్రజలనుండి వచ్చి ఉంటాయనీ, పురాణాలే విడగొట్టబడి ముక్కలై కథలకు మూలమయ్యాయనీ వీరి సిద్ధాంతం. తరువాత కాలంలో గ్రిమ్‌సోదరుల ఈ అభిప్రాయలు తులనాత్మక పురాణ శాస్త్ర' విద్వాంసులకు స్ఫూర్తినిచ్చాయి. వీళ్ళలో మ్యాక్స్‌ముల్లర్, జాన్ ఫిస్కే, సర్ జార్జ్ కాక్స్ ముఖ్యులు. 'Mythology's Pathology of language' అని మ్యాక్స్ ముల్లర్ అభిప్రాయపడ్డాడు. 1859లో తన పంచతంత్రానికి ప్రస్తావన వ్రాస్తు జానపదకథలకు భారతదేశమే మూలమని థియోడర్ బెన్ఫె అభిప్రాయపడ్డాడు.

మానవశాస్త్ర దృష్టితో కథలను అధ్యయనం చేసిన వాళ్ళల్లో ఆండ్రూ ల్యాంగ్ ప్రముఖుడు.కథలు పురాతనకాలపు అవశేషాలు అతని ఈతనిఅభిప్రాయం. మానవశాస్త్రంలో పంతొమ్మిదవ శతాబ్దంలో ప్రచలితమైన బహుళోత్పత్తివాదాన్ని (బహుమూల సిద్ధాంతం) అంగీకరించిన వాళ్ళలో ల్యాంగ్ ఒకడు. కథలు అనేక ప్రదేశాల్లో అస్తిత్వాని పొంది ఉంటాయనీ వాటిలో సాదృశ్యాలు కన్పిస్తాయని ఈయన అంగీకరిస్తాడు. సమాన కథలకు సమాన సంస్కృతులే కారణమని ఈయన అభిప్రాయం.

జానపదకథల మూలాన్ని లెక్కించిన జానపద విజ్ఞానాంశాలను అధ్యయనం చేయడంలో గమనించదగ్గ సిద్ధాంతాల్లో చారిత్రక భౌగోళిక విధానం ఒకటి. ఇది జానపదకథల చరిత్రని పునర్నిర్మించడంలో తోడ్పడింది. కథయొక్క మూల స్వరూపాన్ని ప్రదేశాన్ని గుర్తించడమే దీని ఉద్దేశం. ఈ విధానం బహుమూల సిద్ధాంతాన్ని అంగీకరించదు. దీని ప్రకారం వందలకొద్ది పాఠాలతో వ్యాపించిన కథలు, ఏదైనా ఒక కాలంలో, ఒక ప్రదేశంలో జనించి తర్వాత ఇతరదేశాలకు వ్యాపించి ఉండవచ్చు. దీన్ని ప్రతిపాదించిన వాళ్ళల్లో జ్యూలియస్ క్రోహ్న్, కార్లేక్రోహ్న్, అంటీ ఆర్నే ముఖ్యులు.

జానపద కథల మూలాన్ని కనుక్కోవడంలో ఉపయోగించే సిద్ధాంతాల్లో స్వప్నమూల సిద్ధాంతం ఒకటి. లూడ్విగ్, లెయిస్నర్ మొదలైన వాళ్ళు ఈ సిద్ధాంత ప్రతిపాదకులు. వీరి ప్రకారం కథల్లో కన్పించే అనేకాంశాలకు స్వప్నాలే కారణం. కర్మకాండాల సిద్ధాంతం మరొకటి. దీని ప్రకారం ధార్మిక సంబంధమైన ప్రాచీన కర్మకాండల జానపదకథలకు మూలమాట మనోవిశ్లేషణ సిద్ధాంతం ఇంకొకటి. దీని ప్రతిపాదకుడు సిగ్మండ్ ఫ్రాయిడ్. ఈయన ప్రకారం జానపదకథల్లో కన్పించే సామ్యానికి Psychic unit of man kind కారణమట.

ఏమైనా పై సిద్ధాంతాల్లో ఏదీ సంపూర్ణం కాదు.

## జానపద కథల వర్గీకరణ

జానపద విజ్ఞానాన్ని వర్గీకరించిన ఆర్.ఎస్.బాగ్స్ జానపద కథలను సాహిత్య వర్గంలో చేర్చాడు. జానపదగేయ కథల్లోనూ గద్యకథల వస్తువుల లక్షణాలు కన్పించడంవల్ల గద్యకథనాలనే (Prose Narratives) ప్రత్యేక విభాగంగా గుర్తించాడు.

వస్తు వైవిధ్యాన్ని బట్టి జానపద కథా సాహిత్యాన్ని వింగడించాల్సి ఉంటుంది. స్టిత్ థాంసన్ మొదలైన విద్వాంసులంతా వాక్సంప్రదాయంలో ప్రచారంలో ఉన్న అన్ని గధ్యకథల్ని జానపద కథలుగా పేర్కొనడం వల్ల పురాణాలు, ఐతిహ్యాలు కూడ జానపద కథావ్యాప్తికి చేరుతాయి. అయితే నేటి నాగరికతా సంస్కృతిలో ప్రచారంలో ఉన్న గధ్యకథల్ని పురాణం, ఐహిత్యం, జానపద కథ అని వింగడించాల్సి వుంటుంది. వస్తువులోను, ఆకారంలోనూ ఉద్దేశంలోనూ అవి ఒకదాని కొకటి భిన్నంగా ఉంటాయి.

ఎన్సైక్లోపేడియా బ్రిటానికాలో జనప్రియ కథలు పురాణాలు, ఐతిహ్యాలు, కథలు అని వింగడించ బడ్డాయి. సంపుటం9, పుట 447.

స్టాండర్డ్ ఆఫ్ డిక్షనరీ ఫొకొలోర్ అన్న గ్రంథంలో స్టిత్ థాంసన్ జానపద కథలని ఐతిహ్యాం, అద్భుత కథలు, జంతువుల కథలు, నీతికథలు, పురాణాలు అని వింగడించాడు.

ద సైన్స్ ఆఫ్ ఫేయిరీ టేల్స్ అన్న గ్రంథంలో ఎడ్విన్ సిడ్నీ హార్టు ల్యాండ్ అనే అతడు జానపద కథను సాంప్రదాయికంగా వచ్చిన వ్యక్తీకరణగా అభివర్ణించాడు. ఇలాంటి కథలను ఆయన సాగా, మార్షెన్ అని రెండు విధాలుగా వింగడించాడు. "సాగా"కు సంబంధించిన కథల నిర్దిష్ట స్థలానికి సంబంధించి, నిర్దిష్ట మానవాతీతవ్యక్తులకు సంబంధించినవి. కొన్నిమార్లు ఈ కథల్లో చారిత్రక వ్యక్తులు కూడ ప్రవేశించవచ్చు. "మార్షెన్"కు సంబంధించిన కథలు వినోద కథనాలు, విభిన్నకాలాల్లో, విభిన్న దేశాల్లో సంభవించి ఉండవచ్చని నమ్మిన సంఘటనల మీద ఆధారపడినట్టివి, వీటిలో కల్పన ఉంటుంది. అయితే వీటిని చెప్పేవాళ్ళుకానీ, వినేవాళ్ళుకానీ, నమ్మాలనీ లేదు. ఈయన చెప్పే "సాగా" ఐతిహ్యానికీ, "మార్షెన్" జానపద కథకీ సరిపోతాయట.

మిల్లర్ ప్రకారం జానపద కథలు మూడు రకాలు. అవి కిన్నెర కథలు, ప్రైనందిన కథలు, జంతువుల కథలు.

వుండ్ట్ అనే జర్మన్ పండితుడు కథలని ఏడు విధాలుగా వింగడించాడు. అవి 1 పౌరాణిక నీతి కథలు 2. శుద్ధ కిన్నెర్నకథలు 3. జైవిక కథలు, నీతికథలు 4. శుద్ధ జంతువుల కథలు 5. వంశ సంబంధ కథలు 6. తమాషా కథలు, నీతి కథలు 7. నీతి కథలు (చూ. మార్ఫాలజీ ఆఫ్ ఫోక్ టేల్, పుట 6).

ఫోక్‌లోర్ అండ్ ఫోక్ లైఫ్ అన్న గ్రంథంలో పుటలు (62–72) లిండా డె కథలను సంకీర్ణ కథలు, సరళ కథలు అని వింగడించాడు. సంకీర్ణ కథలు మళ్ళీ మూడు విధాలు 1. మార్షన్ లేదా మ్యాజిక్ టేల్ 2. ధార్మిక కథలు 3. కాల్పనిక కథలు. సరళ కథలు మళ్ళీ మూడు విధాలు. అవి 1. ప్రాణి కథలు 2. వినోద కథలు 3. లాక్షణిక కథలు.

ప్రచారంలో ఉన్న తెలుగు జానపద కథలను దృష్టిలో ఉంచుకొని ఈ కింది విధంగా వింగడించవచ్చును. అవి :

1. పురా కథలు (Mythological Tales)
2. ఐతిహాసిక కథలు (Legendery Tales)
3. హాస్యకథలు లేదా మూర్ఖుల కథలు (Drolls and Noodles)

4. మోసగాండ్ర కథలు (Trickster tales)
5. సుదీర్ఘకథలు (Tall Tales)
6. సమస్యాత్మక కథలు (Dilemma Tales or Riddle Stories
7. ప్రాణికథలు (Animal Tales)
8. అద్భుతకథలు (Fairy Tales)
9. నీతికథలు (Sociological Tales)
10. సామాజిక కథలు (Moral Tales or Fables)

ఇటీవల కాలంలో జానపదకథలను కథలలో కన్పించే కథనఘటకాల (Motifs) సహాయంతోనూ మాదిరుల (Types) ను దృష్టిలో పెట్టుకొని విభజించడం జరుగుతుంది.

కథనఘటకమున: స్టిత్ థాంసన్ కథల్లోఉన్న కథనఘటకాలను అధ్యయనం చేసి ప్రపంచంలో ఉన్న కథల్లో సమానంగా కన్పించే అంశాలను సంగ్రహించిన Motif index of Folk Literature అనే ఆరు సంపుటాల గ్రంథాన్ని ప్రచురించాడు. ఆయన ప్రకారం కథనఘటకం అంటే "మౌఖిక సంప్రదాయంలో నిలద్రొక్కుకున్న కథలోని కనిష్ఠాంశం" (The folk tale. P. 415). దీన్నే "మూలాంశం" అని కూడ అంటారు. కథనఘటకం అనిపించుకోవాలంటే ఒక అసామాన్య విషయం లేదా ఏదో ఒక విశేషం ఉండి తీరాలి. కథా నిరూపణలో "పాత్రలు, వస్తువులు, సంఘటనలు" అనే అంశాలు ఇలాంటి విశేషాంశాలకు సంబంధించి ఉంటాయి.

తెలుగు జానపద కథల్లో కన్పించే కథన ఘటకాలకు ఒకటి, రెండు ఉదాహరణలు.

1. "తెనాలి రామకృష్ణుని కథ"లులో చిలుక పలుకులు ఒక కథన ఘటకం. ఇది Motif Index of folk literatureలో ఉన్న B 211. 3.4 Speaking parrot అన్న కథన ఘటకానికి సంబంధించింది.
2. "భేతాళ కథలు"లో విషపూరిత భక్ష్యాలు మరొక కథన ఘటకం. ఇది పై గ్రంథంలో H 1515 Poisoned Food Test

(Attempt to kill hero by feeding him poisoned food) అనే కథన ఘటకానికి సంబంధించింది.

మాదిరి (Type) : అంటి ఆర్నె మరియు స్టిత్‌థాంసన్ విద్వాంసులు కథలని అధ్యయనం చేసేవాళ్ళకు కథాసామగ్రిని వర్గీకరించి అందించేయత్నంలో The types of the Folktale : A classification and Bibliography అనే గ్రంథాన్ని ప్రచురించారు. థాంసన్ అభిప్రాయంలో 'మాదిరి' అంటే స్వతంత్ర అస్తిత్వంలో ఉండదగిన సాంప్రదాయిక కథ. ఇది స్వయం సంపూర్ణంగా ఉంటుంది. తన అర్థం కోసం మరొక కథపై ఆధారపడదు. ఇలాంటి ప్రతి ఒక్క మాదిరి ఒకటి లేదా అనేక కథనఘటకాలతో ఏర్పడుతుంది. కథావర్గ సూచిలో కథలు ఐదు ముఖ్యవిభాగాలుగా వింగడించబడ్డాయి. అవి 1. జంతువుల కథలు 2. సాధారణ కథలు 3. హాస్యం లేదా వినోదకథలు 4. సూత్ర కథలు 5. అవర్గీకృతకథలు.

ప్రతి విభాగాన్ని ఉపవిభాగాలుగా వింగడించడం జరిగింది. ప్రతి కథా ఒక్కొక్క నిర్దిష్టసంఖ్యతో గుర్తించబడి దాని క్రింద అయా మాదిరుల సంక్షిప్త పరిచయం చేయబడింది. ప్రతి మాదిరి ప్రక్కనే దానికి సంబంధించిన మరొక మాదిరి ఇవ్వబడింది. ఏ కథ ఏ దేశానికి చెందింది, ఏ గ్రంథానికి చెందింది అనే వివరణ ఇవ్వడం జరిగింది. కథలను అధ్యయనం చేసేవాళ్ళకు ఇలాంటి మాదిరి సూచివల్ల ఒక కథయొక్క నిర్దిష్ట పాఠం, దాని విభిన్నరూపాలు, అదిప్రాచుర్యంలో ఉన్న ప్రదేశం ఇత్యాది విషయాలు లభిస్తాయి. కథల తులనాత్మక అధ్యయనానికి ఇలాంటి మాదిరులసూచి అత్యంత సహాయకారిగా ఉంటుంది.

## జానపద కథల అధ్యయనం :

జానపద కథాధ్యయనంలోనూ ఇతర జానపద విజ్ఞాన ప్రక్రియలలాగానే 1. సేకరణ 2. పరిష్కరణ 3. విశ్లేషణ అన్న మూడు దశలు ఉన్నాయి. ఈ మూడు ఒకదాని మీద ఒకటి ఆధారపడి ఉంటాయి.

జానపద కథలను సేకరించడంలో మొదటి దశ క్షేత్రకార్యం. క్షేత్ర కార్యమంటే సేకర్త, వ్యవహర్త సమావేశమయ్యే ప్రదేశం. జానపద కథను

మౌఖికరూపంలో సంగ్రహించేటప్పుడు గమనించదగ్గ ముఖ్యవిషయం ఆ కథను యథాతథంగా వ్యవహర్తనుండి అంటే వ్యవహర్త ఏ శైలిలో చెప్తున్నాడో అదె శైలిలోనే సేకరించడం. కథలను సేకరించేవాళ్లు తమ శైలికి అనుగుణంగా కథలను మలచుకోవడం జరుగుతూ ఉంటుంది. ఇక్కడే సేకర్తలు సాధారణంగా తప్పు చేస్తుంటారు. 'Stories really Collected can only be valuable if given unaltered' అని అంటాడు. జాన్ ఫ్రాన్సిస్ క్యాంప్ బెల్ (ఫోక్ లోర్ అండ్ ఫోక్ లైఫ్, పుట 65) కథా కథనంలోనూ, భాషా వైవిధ్యంలోనూ, కథా సంప్రదాయంలోనూ వ్యవహర్తలలో భిన్నత్వం కనిపిస్తుంది. కనుకనే వాటిని యధాతథంగా సేకరించాల్సి వుంటుంది.

జానపద కథలను సంగ్రహించేటప్పుడు సేకర్త గమనించ దగ్గ ముఖ్యాంశాలు మరికొన్ని ఉన్నాయి. ఈ ముఖ్యాంశాలను అనుసరించడానికి ప్రశ్నావళి ఎంతో అవసరమవుతుంది. ఫోక్‌లోర్ అండ్ ఫోక్ లైఫ్ (పుట 410) అన్న గ్రంథంలో డొనాల్డ్ ఎ మ్యాక్‌డొనాల్డ్ ఒక ఐరిష్ విద్వాంసుని (Sean O'Sullivan) ప్రశ్నావళి నొకదానిని తన వ్యాసంలో ఇలా ఉల్లేఖించారు. వాటి నిక్కడ ఉట్టంకిస్తాను. సాధ్యమైతే ప్రతి కథకుని మరియు అతని గృహ చిత్రాన్ని తీసుకోవడం మంచిది. ప్రతి కథకుని జీవిత చరిత్రని గురించిన విషయాలను అతనినుంచే సంగ్రహించాలి. సాధ్యమైతే కథకుని వంశ చరిత్రని తెలియజేయాలి.

కథను ఏ సన్నివేశంలో చెప్పడంజరుగుతోంది అన్న విషయాన్ని చెప్పాలి. సాధారణంగా కథలను ఎక్కడ చెప్తారు ? పొయ్యి గట్టుచెంతనా ? జాగరణ సమయంలోనా ? కొలిమిచెంతనా ? పొలాల్లో పనులు చేసుకొనేటప్పుడా? గరిక మైదానాల్లోనా ? చేపలుపట్టే పడవల్లోనా ? కథకులు సాధారణంగా కథలు చెప్పడానికి ఎలా ప్రేరితులవుతారు? కథకులు మరియు శ్రోతలకు సంబంధించినట్టుగా ఏ పరిస్థితులు అవసర మవుతాయి ? కొన్ని కథలు కథకునికీ శ్రోతలకూ ఇద్దరికీ ప్రీతిపాత్రంగా ఉంటాయా? కథకులు తాము ఎంచుకొన్న కొన్ని కథలను మాత్రమే చెప్తారా ? లేక శ్రోతలు కోరిన నిర్దిష్ట కథలను చెప్పడానికి అంగీకరిస్తారా? వాళ్లు సంజ్ఞలను ఉపయోగిస్తారా? వివరించాలి. కథ చెప్పే సందర్భంలో

వచ్చే ఆటంకాలను లేదా సంతావాద్యర్థకాలను కథకుడు మరియు శ్రోతలు స్వాగ తిస్తారా? కథనడిచే సందర్భంలో శ్రోతలు వ్యక్తపరిచే వ్యాఖ్యానం లేదా సంతా సంతావాద్యర్థకం సాధారణంగా ఏ మాదిరిలో ఉంటుంది? ముగింపులో ఏమి చెప్పబడుతుంది (కథకుని పొగడ్త, కథ లేదా దాని పాత్రలను గురించిన వ్యాఖానం ఇత్యాది) శ్రోతలు ఇంత వరకు చెప్పిన కథలను నేర్చుకొని, ఆపై చెప్తారా? కథలను చెప్పే కేంద్రాలనే కొన్ని ఇళ్లు ఉంటాయా?

జానపదకథల వర్గీకరణ విధానంలో ఇంతకు ముందే పేర్కొన్నట్లుగా కథనఘటకం (Motif) మరియు మాదిరుల (Types) పాత్ర గమనార్హమైంది. స్థూలంగా కథన ఘటకం కథావస్తువుకు సంబంధించింది అయితే మాదిరి దాని శిల్పానికి సంబంధించింది జానపద కథా మూలాలను పునర్నిర్మించడంలో ఈ రెండింటి పాత్ర ప్రశంసింపదగింది.

## భారతదేశంలో జానపద కథల సేకరణ :

జానపద విజ్ఞాన సంగ్రహకార్యం. ఐరోపాఖండంలో పందొమ్మిదవ శతాబ్దంలో మొదటి భాగంలో ఆరంభమైంది. 1812లో గ్రిమ్ సోదరులు Kinder Und/Hausmarchen అన్న కథాసంకలనాన్ని ప్రచురించి, కథా సంగ్రహ కార్యానికి నాందీపలికి తక్కినవారికి మార్గదర్శకులైనారు.

భారతదేశంలో జానపద సాహిత్యసేకరణ పాశ్చాత్యపండితులవల్లనే ఆంగ్లంలోనే మొట్టమొదట జరిగింది. అబ్బేడూబామిస్ గారి 'హిందూ మ్యానర్స్ అండ్ కస్టమ్స్' అన్న గ్రంథం 1816లో వెలువడింది. ఇందులో జానపదకథలు ఉన్నాయి. 'ఓల్డ్ డెక్కన్ డేస్' లేదా 'ఇండియన్ ఫేరీ అజెండ్స్ కరెంట్ ఇన్ సౌత్ ఇండియా' అన్న గ్రంథాన్ని ఎం. ఫేరె 1868లో వెలువరించారు. ఇదే భారతదేశంలోని ప్రప్రథమ సేకరణ గ్రంథమని చెప్పబడుతోంది. (కన్నార జానపదకథెగళు, పుట 331) 1879లో స్టోక్ అనే అతను 'ఇండియన్ ఫేరీ టేల్స్'ను ప్రచురించాడు. 1883లో బెంగాలీ కథల సంకలనాన్ని ఎల్. బి. డే. ప్రకటించారు. 1887లో జె. హెచ్. నోవెల్స్ కాశ్మీరు జానపదకథలని ప్రచు రించారు. 1892లో జె జాకొబ్ 'ఇండియన్ ఫేరీటేల్స్' అన్న గ్రంథాన్ని ప్రకటించాడు 1884–85, 1900లో ఆర్. సి. టెంపల్ 'లెజెండ్స్ ఆఫ్ పంజాబ్' అన్న గ్రంథాన్ని మూడు సంపుటాలలో ప్రచురించాడు. ఫోక్ టేల్స్

ఆఫ్ సదరన్ ఇండియా" అన్న గ్రంథాన్ని పండిత నటేశ శాస్త్రిగారు 1884–1893లో ప్రచురించారు. 1892 లోనే ఎ. క్యాంపెబెల్ "సంతాల్ జానపద కథ" లను సేకరించాడు. 1894లో ఎఫ్. ఎ .స్టీల్ పంజాబ్ కథలను ప్రచురించాడు. ఆర్. సి. టెంపల్ తో కలిసి ఆయనే "వైడ్–అవేక్ స్టోరీస్" అన్న గ్రంథాన్ని 1884లో ప్రచురించారు.

ఈ. ఎమ్. గోల్డన్ 1909 లో ఇండియన్ ఫోక్ టేల్స్" అన్న గ్రంథాన్ని ప్రచురించారు. 1916 లో ఫోక్ టేల్స్ ఆఫ్ అస్సాం" అన్న గ్రంధాన్ని జె. బారువా గారు, 1912లో డబ్ల్యూ. ఎం.సి. కుల్లక్" బెంగాలీ హౌస్ హోల్డ్ టేల్స్"ను 1912 లో "డెక్కన్ నర్సరీ టేల్స్" లేదా ఫేరీటేల్స్ ఫ్రమ్ ది సౌత్" అన్న గ్రంధాన్ని సి. ఏ. కింకేయిడ్ ప్రచురించారు. బ్రాడ్లీబర్ట్ గారి "బెంగాల్ ఫేరీ టేల్స్" 1920తోను, సి. ఏ. కింకేయిడ్ గారి టేల్స్ ఆఫ్ ఓల్డ్ సింధ్" 1912 లోను. పి. ఓ. బోర్డింగ్ గారి "సంతాల్ ఫోక్ టేల్స్" మూడు సంపుటాలు 1925–29 ప్రాంతంలోను ప్రచురించబడ్డాయి.

భారతదేశంలో సేకరించబడిన మరికొన్ని జానపద కథా సంకలనాలు :

1. చార్లెస్ స్విన్నెర్టన్ – "రొమాంటిక్ టేల్ ఫ్రమ్ ది పంజాబ్" (1928)
2. "ఫోక్ టేల్స్ ఆఫ్ అస్సామ్ (1915)
3. ఎస్. కాశీంద్రనాథ్ బెనర్జీ – "పాపులర్ టేల్స్ ఆఫ్ బెంగాల్" (1905)
4. ఏస్. బి. బెనర్జీ–"టేల్స్ ఆఫ్ బెంగాల్" (1910)
5. విల్ఫ్రెడ్ ఇ. డెక్స్టర్ – మరాఠీ ఫోక్ టేల్స్ (1938)
6. డబ్లు. హెచ్. డి. రౌస్ – "ది టాకింగ్ త్రస్ట్ అండ్ అదర్ టేల్స్" (1938)
7. డా. వరియర్ ఎల్విన్ "ఫోక్ టేల్స్ ఆఫ్ మహాకోశల్" (1944)
8. ఎం. జి. ఆండర్సన్ – "ఇండియన్ ఫేబల్స్ అండ్ లిజెండ్స్"(1936)
9. ఏ. యస్. పి. అయ్యర్ – "ఫేమస్ టేలర్ ఆఫ్ ఇండియా" (1954)
10. సురేశ్ భాట్నగర్ – "సచిత్ర్ కురుప్రదేశ్ కి లోక్ కథామే (1959)
11. పంచిప్రీతమ్ సింగ్ – పంజాబ్ కీ లోక్ కథామే" (1957)
12. జ్ఞానేంద్రకుమార్ భాట్నగర్–"సచిత్ర్ కేరళ్ కే లోక్ కథామే"(1958)

13. జ్ఞానేంద్రకుమార్ భాట్‌నగర్ – సచిత్ తమిళ్‌నాడ్‌కీ లోక్ కథామే" (1959)

14. జ్ఞానేంద్రకుమార్ భాట్‌నగర్ – "సచిత్ కర్నాటక కీ లోక్ కథామే" (1959)

15. ఏసియా పబ్లిష్టింగ్ హౌస్, బాంబే–ఫోక్ టేల్స్ ఆఫ్ రాజస్థాన్"(1964)

ఇలాగే ఎం. బి. ఎమెనో దక్షిణ భారత జానపదకథపని అధ్యయనం చేసి కొన్ని వ్యాసాలను పత్రికలలో ప్రచురించారు. కర్నాటక రాష్ట్రంలో వందకు పైగా జానపద కథా సంకలన గ్రంథాలు వెలువడ్డాయి. స్టెర్లింగ్ పబ్లిషర్స్, ఢిల్లీవారు భారతదేశంలోని పెక్కు రాష్ట్రాల జానపద కథలను ప్రత్యేకంగా ఆయా రాష్ట్రాల వారీగా ఆంగ్లంలో ప్రచురించారు. ప్రధానంగా జానపద కథల సేకరణ కృషిని గురించి మాత్రమే ఇక్కడ ప్రస్తావించడం జరిగింది. మరికొన్ని వివరాలకు డా. శ్యామ్‌పర్మార్ మరియు శ్రీ శంకరసేన్‌గుప్తా గారల "ఎబిబ్లియోగ్రఫీ ఆఫ్ ఇండియన్ ఫోక్‌లోర్ అండ్ రిలేటెడ్ సబ్జెక్ట్స్" అన్న గ్రంథాన్ని, డా. జవహర్‌లాల్ హండూ గారి "ఎ బిబ్లియోగ్రఫీ ఆఫ్ ఇండియన్ ఫోక్‌లోర్ అన్న గ్రంథాన్ని, హెచ్. సి. ప్రసాద్ మరియు గీతాసేన్‌గుప్తాగారల "ఎ బిబ్లియోగ్రఫీ ఆఫ్ ఫోక్‌లోర్ ఆఫ్ బీహార్" అన్న గ్రంథాన్ని చూడగలరు.

**ఆంధ్రదేశంలో జానపద కథల సేకరణ :**

తెలుగులో చెప్పుకోదగినంత సేకరణ కానీ, అధ్యయనం కానీ జరగలేదు.

1900 లో శ్రీ పండిత నటేశ శాస్త్రిగారు తెనాలి రామలింగని కథలను సేకరించారు. ఆంగ్లంలో "హీరమ్మ అండ్ వెంకటస్వామి ఆర్ ఫోక్ టేల్స్ ఫ్రమ్ ఇండియా" అన్న గ్రంథాన్ని ఎం. ఎన్. వెంకటస్వామిగారు 1918లోను "హ్యూమరస్ స్టోరీస్ ఆఫ్ తెనాలి రామలింగం" అన్న గ్రంథాన్ని చేకుముళ్ళ రాజగోపాల రావుగారు 1913 లోను, "టేల్స్ ఆఫ్ ఎ తెలుగు పరియా ట్రైబ్స్" అన్న గ్రంథాన్ని 1899 లో Hodder & Stoughten, లండన్ వారు ప్రచురించారు.

"ఫేమస్ టేల్స్ ఆఫ్ ఇండియా" అన్న గ్రంథంలో కొన్ని తెలుగు కథలు, జాతీ ఓల్డ్ టేల్స్ ఆఫ్ ఇండియా"(1945) అన్న గ్రంథంలో మరి కొన్ని తెలుగు కథలు ఉన్నాయి.

డా.బి.రామరాజుగారి "ఫోక్ టేల్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్" అన్న గ్రంథాన్ని స్టెర్లింగు పబ్లిషర్సు ఢిల్లీవారు 1974లో ప్రచురించారు. ఇందులో 39 తెలుగు తెలుగు జానపద కథలను ఇంగ్లీషులోనికి అనువాదం చేయడం జరిగింది. ఇవన్నీ కూడ ఆంధ్రదేశంలో బాగా ప్రచారంలో ఉన్నదే. ఈ కథల్లో అధికం నీతిని బోధించేవి. తక్కినవాటిలో హాస్యం, విశ్వాసం, తుంటరితనం మొదలైన అంశాలు ఉన్నాయి.

డా. కర్ణరాజ శేషగిరిరావుగారు తెలుగు ఫోక్ టేల్స్ రీటోల్డ్ ఇన్ ఇంగ్లీష్ అన్న గ్రంథాన్ని ప్రచురించారు. ఇందులో 12 తెలుగు జానపద కథలు ఆంగ్లంలో చెప్పబడ్డాయి. సింగడు, మాంచాల. కాంభోజరాజు, బ్రహ్మనాయుడు, మొదలైన వాళ్ళ కథలు, అనగనగా ఒకరాజు, రామలింగడి పిల్లి ఇత్యాది ప్రసిద్ధమైన జానపద కథలు ఉన్నాయి.

పోతే గుజిలీ పాటల విక్రేతలే తెలుగు జానపద కథల్ని కూడ అచ్చు వేయడం జరిగింది. వాటిలో వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, ఎస్. వి. గోపాల్ అండ్‌కో, కాళహస్తి తమ్మారావు అండు సన్స్. సి. వి. కృష్ణా బుక్ డిపో, యస్. అప్పలస్వామి అండ్ సన్స్, తెనాలి ఆంధ్రరత్నబుక్ డిపో, జనరల్‌బుక్ డిపో, గొల్లపూడి వీరాస్వామిఅండ్ సన్స్, కొండా శంకరయ్య, శ్రీ లక్ష్మీనారాయణ బుక్ డిపో మొదలైన ప్రచురణ సంస్థలు పేర్కొనదగ్గవి. "తెలుగు జాతీయముల కథ"లన్న పేర్తో ముసునూరి వెంకట శాస్త్రిగారు, "ఆంధ్రదేశీయ కథావళి" అన్న పేరుతో టేకుమళ్ళ రాజగోపాల రావుగారు ప్రచురించారు.

అయితే పైన పేర్కొనబడినవన్నీ జానపదుల భాషలోనే యథాతథంగా సేకరింపబడినవి కావు. జానపద కథలోని భాషనీ, మారుమూల పదాలనీ, పలుకుబళ్ళనీ, సాంఘిక పద్ధతుల్నీ అధ్యయనం చేయడానికి ఇవి అంతగా ఉపకరించవు. వారి మాటల్లోనే యథాతథంగా అచ్చమైన జానపద కథలను సేకరించినప్పుడు కూలంకషమైన అధ్యయనం చేయడానికి వీలవుతుంది. తెలుగుభాషమీద తక్కిన భాషల ప్రభావం, ఆంధ్ర సంస్కృతిమీద తక్కిన ప్రాంతాల సంప్రదాయాలు, ఆచారవ్యవహారాల ప్రభావం, క్షుణ్ణంగా తెలుసుకోవడానికి జానపదుల నుండే సేకరించిన కథలు దోహదం చేస్తాయి.

## తెలుగు జానపద కథలు — నేటి పరిస్థితి

తెలుగులో జానపద గేయాలను సేకరించిన ప్రయత్నంలో కనీసం నూటిలో ఒకటవ వంతైనా జానపద కథల సేకరణ విషయంలో జరగలేదంటే ఆశ్చర్య పడాల్సిన అవసరం లేదు. కన్నడిగులతో పోల్చిచూచుకొన్నప్పుడు మనం నిజంగా సిగ్గుపడాలి. జానపదగేయాలు, జానపద కథల సేకరణ విషయంలో కన్నడిగులు మనకంటే ఎన్నో అడుగులు ముందున్నారు. వాళ్ళనెప్పుడు అందు కుంటామో ! కన్నడంలో లెక్కలేనన్ని జానపదకథాసంకలనగ్రంథాలు వెలువడ్డాయి, వెలువడుతూనే ఉన్నాయి. కొంతవరకు కథల విశ్లేషణకూడ జరిగింది. ఒకటి రెండు సిద్ధాంత వ్యాసాలు వచ్చాయి. తెలుగులో అచ్చమయిన జానపద కథాసంకలన గ్రంథాలు రాలేదనే చెప్పాలి. తెలుగు జానవదకథలను గురించిన అధ్యయనం, పరిశోధన ఇప్పుడిప్పుడే మొదలయ్యింది. "తెలుగు జానపద కథల"మీద శ్రీమతి కె సుమతి గారు, "తెలుగు జానపద సాహిత్యము పురాగాథలు" మీద శ్రీమతి రావి ప్రేమలతగారు పి.హెచ్.డి. చేశారు. (ఉస్మా నియా విశ్వవిద్యాలయం, 1980, 81) "చిత్తూరుజిల్లా జానపద కథ"ల మీద శ్రీ ఎస్. వెంకటమునిరెడ్డి గారు, బెంగుళూరు విశ్వవిద్యాలయంలోను, "అనంత పురం జిల్లా జానపద కథ"ల మీద శ్రీ సి. పెద్దిరెడ్డి గారు మైసూరు విశ్వవిద్యా లయంలోను, శ్రీ బి. బాలస్వామిగారు "మహబూబునగర్ జిల్లా జానపదకథ"ల మీద ఉస్మానియా విశ్వవిద్యాలయంలోను పి.హెచ్.డి చేస్తున్నారు.

అసలైన జానపద కథలసేకరణ తెలుగులో జరగకపోవడం వల్ల తెలుగు జానపద కథలు ఎంత విస్తృతపరిధిలో ఉన్నాయో, ఎంతటి వైవిధ్యంతో కూడు కొని ఉన్నాయో అంతుపట్టకుండా ఉంది. తెలుగులో అధికంగా గ్రంథరూపంలో వచ్చిన జానపదకథలన్నీ సంస్కృతం లేదా ఇతర భాషలనుండి అనువదించ బడ్డవే. జాతక కథలు, కథా సరిత్సాగరం, భట్టి విక్రమార్కుని కథలు, పంచ తంత్ర కథలు ఇత్యాదులన్నీ ఈ కోవకు చెందినవే.

ఆంధ్రదేశంలో లెక్కలేనన్ని జానపద కథలూ, లెక్కకు మిక్కుటంగా జానపద కథకులూ ఉన్నారు. ఉన్న చిక్కంతా సేకర్తలు లేకపోవడమే. ఉన్న వారికి తగిన ఆదరణ, ప్రోత్సాహం లేకపోవడమే. ఒకప్పుడు జానపద సాహిత్యం అనాదృత వాఙ్మయంగా తిరస్కరించబడ్డా, ఇప్పుడిప్పుడు జానపద

విజ్ఞానం ఆదరణీయ సాహిత్యంగా ప్రజల మన్ననలను చూరగొంటున్నది అయితే ఈ ఆదరణ కేవలం మాటల్లోనే ఉంది. ఏమైనా అటు ప్రభుత్వం, ఇటు అకాడమీలు జానపద సాహిత్య సేకరణ విషయంలో శ్రద్ధ చూపాలి, పరిశోధకులకు నిధులు సమకూర్చాలి. ఈ జానపద కథా సంప్రదాయాన్ని ఇంకా నిలుపుకొంటూ వస్తున్న వ్యవహర్తలకు ఆర్థికంగా సాయంచేయాలి. వృత్తి జానపద కథకులను ప్రోత్సహించాలి. అలా అయినప్పుడే జానపద కథల సేకరణ కొంతవరకైనా జరుగుతుంది. సేకరణలతో తృప్తిపడకుండా, సేకరించిన వాటిని మానవశాస్త్ర పరంగానూ, భాషా శాస్త్రపరంగానూ, చారిత్రకంగానూ, తులనాత్మకంగానూ విశ్లేషించి అధ్యయనం చేయడానికి పూనుకోవాలి.

చివరిగా ఒక విషయం "జానపద విజ్ఞాన మూలాన్ని నిర్ధారించడంలోనూ, దాని చారిత్రక భౌగోళిక రూపాలను పరిశోధించడంలోనూ ఇతర జానపద విజ్ఞాన ప్రక్రియకంటే కథలదే మైలురాయి". అన్న విషయాన్ని, మనందరం గుర్తుంచుకోవాలి. (ది స్టడీ ఆఫ్ ఫోక్‌లోర్", పుట 53, అలన్ డండిస్).

English :


1. Standard of foklore, Legend And Mythology
—Edy. by Maria Leach.

2. The Folktale —Stitv Thompson.

3. Folklore And Folklife —Richard M. Dorson

4. Falktales of Andhra Pradesh —Dr. B. Ramaraju.

5. Folklore of Andhra Pradesh
—Dr B. Ramaraju.

6. Motif Index of folk literature (6 Vols)

7. An Introduction to the Study of Indian folklore.
—Dr P. R. Subramaniam.

8. An out line of Indian folklore.
—Durga Bhagavath.

9. A Biblography of Indian folklore.
—Dr. Jawaharlal Handoo.

కన్నడం ;

1. జానపద కథెగళు — ఎల్.ఆర్. హెగ్గడె
2. కన్నడ జానపద కథెగళు. —డా. కె.ఆర్. సంధ్యారెడ్డి
3. జానపద సాహిత్యదర్శన, భాగం 2.
సం.డా.ఎం.ఎస్. సుంకాపుర
4. జానపద స్వరూప. —డా. హా.మ. నాయక
5. జానపద అధ్యయన విచార సంకిరణ.
—సం.హం.ప. నాగరాజయ్య

# 1. పెండ్లి గుమ్మ కథ

సేకరణ : శ్రీ కె. వి. భట్
బెంగునూరు.

కథ చెప్పినవారు ;
శ్రీమతిమంగమ్మ 85 సం॥

డి. పాళ్యం, గౌరీబిదనూరు తాలూక.
కోలారు జిల్లా [కర్నాటక].

ఒగూర్లో ఒక అడుగోలజ్జి, మాటల మల్లప్ప ఉంౘ్రడీ. ఆ అడుగోలజ్జి ఏంచేసేది, మాటలమల్లప్పింటికి పోయ్యేది. ఏకులు దూదిప త్తిఎత్తుకోని మాటలు మల్లప్పింటో ఏకులు వడికేది ఈ ప త్తి తీస్కోని పోయ్యి, ప్యాట్లో అమ్ముకొనేది, వచ్చేది, గెంజో, అమ్ములో చేస్కోనేది, తాగేది, ఆ తాటాకు ఇంట్లో పొండుకొనేది. ఇట్లే కాలం చేశా. ఒక రోజు నాడేమి చేశా, ఆపొద్దూ ఎత్కోని పోయ మాటలు మల్లప్పింటికి. ఎత్కోని పోయి, ఏకులువడకే లేదు' మాటల్లోనే కాలం అయ్యాయి. పొద్దు మునిగిపాయ. దీపాలంటించే పొద్దాయ. సరి. ఇంగా ఆయమ్మ ఏంచేస్తుంది. కడుపేక్మీ లేదు. అది వడికితేనే జీవనం. లేకుంటే లేదు. సరి. వచ్చా. ఈతట్కి. అప్పా! సూర్యనారాయణా! కడుపేక్మీ లేదే స్వామీ ఈ బద్దు. సూర్యుని పొద్దు మునిగి పొయ్యింది: నువ్వు పడినెత్తి కొస్తే రాత్రి నీదగ్గర వస్తాము స్వామీ అనుకొని చెయ్యెత్తి మొక్కోనా.

ఆయప్పేమి నేసా సూర్యనారాయణ వచ్చా నడినెత్తికి సరిపాయ. బిరీన ఏకు లొడికిచ్చా, పాయ,గంజులు అమ్మలు నే స్కోనా, తాగిడ్చా,మాటల మల్లప్పింటికి ఎల్లిపోతుంది. సామివస్తాడు ఎట్లాంటాని తాటాకుల గుడిసి వాక్లి ఏస్కోనిడిసా, మాటల మల్లప్పింటికి పొయ్యి పండుకోనిడిసా. సరి. సామి ఏం చేశా, మంచినీళ్లు, సొమ్ములు, మడి పూలు, గంధము, పసుపు, కుంకుము, కాయి కర్జూరము, పలారాలు, పండ్లు, పాలు,తాంబూలం అంతారకముగా పెట్టుకోనిడిసా, ఈ తాటాకులు గుడిసి తాకి దిగా. దిగిడిసి తడకదగ్గరికి పొయ్యిడిసి లోపలికి పాయ. పొయ్యిందే మంచంపైన కుకోనా, ఇదంతా తీస్కోంట కూనిడిసా: సరే సామేమినేసా పలారాలంతా బోంచేసా, తాంబూలం ఏస్కోనా, పూగంధం పూస్కోనా, తాంబూలం ఏస్కోని ఒంటికి పాయ. ఒంటికి పొయ్యి కాలుమడిసి ఈ తాంబూలం ఏస్కోన్నె ఈ వక్కాకు అంతా అక్కడ ఉమిసిడిశా. సరి వచ్చిందే రతములో కూకోనిడిసా, ఎల్లిపాయ ఏమీ ఈ పూరిల్లంతా తాటాకులు గుడి సంతా జిమి జిమి అంటుంది. అంత వైభోగముగా ఉంది. సరి. సామి ఎల్లిపాయ. ఈ అడుగోలజ్జి ఏంచేశా. తెల్లవారు జాముకె లేశా ఐదుగంట్లకే. లేసిడిశా. సరి తాటాకుల గుడిసితాకి ఒచ్చా. వచ్చి సూస్తే ఏమి యోగం మలుగుతా ఉంది ఇల్లంతా సొమ్ములు సీర్లు, పునుగులు, జవాజీ అంతా గుమ గుమా అంటుంది. సరి. వచ్చిడిసా. ఆపాతది సీరగుడ్డని అవక్కడ పారేసి డిసా. సరే మంచి సీర కట్టుకోనా, తలదువ్వకోనా, జడేసుకోనా, సొమ్ములంతా పెట్టుకోనా. పెట్టుకోని, ముకము కడుక్కోని ఆ మీట ఈ పలారమంతా ఎత్తి పెట్టుకోనా, కడుపునిండా బోంచేశా. బోంచేసి అంతా మూనిపెట్టుకొని మాటల మల్లప్పింటికి పాయ సొగసై. పోతానే మాటల మల్లప్ప పిలిశా. ఏమియమ్మా అడుగోలజ్జీ ! ఇటువంటివే ఇదంతా నీ క్యాల ఒచ్చా అంటా అడిగా. అమ్మా ! నిన్న పొద్దునునిగి ఏకులు జడికేది కాలా. సూర్యనారాయణిజ్జి ఏడుకొంటి. ఏడుకొనే దీని నడినెత్తికొచ్చా. వస్తానె ఏకులొడికి. పొయ్యి, గందిలుఅమ్ములు నేస్కోని, తాగి మీయింటి కొస్సిప్ప, పొండుకోనుండ్రిడి అనా. సామిపన్నెండు గంట్లు రాత్తిరి కొచ్చి ఇవంతా తెచ్చిపెట్టి పోయ్యిందాదమ్మా అనా. ఎంత పున్యము నేసింటివమ్మా నువ్వు అంటాని నిండా ఇంగంతా ఏడ్చా. ఏడి సామి ఈయమ్మకు అద్చాయ పాత్ర ఇచ్చాంప. ఆ అచ్చయ పాత్రలో పెట్టేది

చేతులు మొకము కడుక్కొనేది, సాంబ్రాణి కడ్డీ అంటించేది, చేయెత్తి మొక్కొనేది, ఆమె కెంతకావాలో అంత ద్రవ్యమయిపోతుంది. బోంచేస్తుంది. బోంచేసి ఇల్లై ఉన్నట్టుగానే ఆసామి కాలుమడిసిన్నే ఒంటికి పొయ్యి కూరాకుమింద, ఒక గూరాకు ఒక దొంటు కూరాకు నేసా, బాగానేసా బోంచేశ ఇంగొగనాడు అదొంటూ నేసా, అదీ బోంచేసా. బోంచేసినట్లే మూన్నెల్లు గర్భవంతురాలయ్యె ఎవ్రవూ ఆ అడుగోలజ్జీ! అపుడేమి నేసేదీ ఈ అక్షయపాత్రలో ఆయమ్మను ఎంత కావాలో అంత భోజనం అవుతుంది, బోంచేసేది హాయిగా ఉండేది. ఈయమ్మకు నవమాసాలు నిండ్తేనే వెండ్లి గుమ్మని తీర్థమాడా. నాకిట్లా వెండ్లిగుమ్మని ఇచ్చినే ఆసామి అని సాకా. సాకి ఇట్లే ఏడాది మూడేండ్లు బిడ్డాయ అ వెండ్లి గుమ్మ.. గౌరమ్మ పండగొచ్చా. వచ్చా ఊరంతా వక్క పొద్దు ఉండారు. ఇండ్లు వాకిండ్లు అలుకుతారు. ఈ వెండ్లి గుమ్మ సెప్పా ముసలమ్మకి, తల్లికి. అమ్మా అమ్మ ఈ బద్దుగౌరి పండగ. గోరమ్మొచ్చే దినము. నేను నాగులకు తని పొయ్యాల. నువ్వు ఇల్లు వాక్లంతా అలుకు. నేను ప్యాట్లోకి పొయ్యి పొడు, కాయి, పూలు, కడ్డీ కర్పూరము అంతా పసుపు కుంకుము ఎత్తుకోని రావల్ల అనా. ఎట్ల పోతావమ్మా అనా. సరి ప్యాట్లోకి పాయ, కొనిందాయ. అంతా సామాన్లన్నీ బుట్లోకి తీస్కొని పెట్లోనిడీసావచ్చా. ఇల్లూ వాక్లీ అంతా అలకమ్మా అని చెప్పిడిసి నాలుగ్గంట్లకే లెయ్యమ్మ అనా. సరి నాల్గంట్లకే లేశా. ఎల్లి పోతాటది. ఈ ప్యాటంతా ఏమి నేస్తారు, ఆయ్యో ఈ వెండ్లి గుమ్మ ఈ బుట్టి మీదేసుకోని, పండ్లు కాయి అంతా పెట్టుకోని, ఎక్కడికి పోతూంది అంటానీ జనమే జనమంతా సూసా ఈ సోద్య మంతాను. సరి ఎల్లిపాయ. పాయ పాయ మంచి హరన్యాకి పొయ్యిడిసా. పాయ అక్కడోమటమూ, ఒక బాయి, ఒక నాగులు పుట్టు, అంతా ఉంది. సరే పైకెక్కొ సూసా. ఎక్కడా ఒక నరమనిషి లేడు, సరే అపుడేమినేసా. అంతా బుట్టి ఆ పుట్టు దగ్గిర దించా. దించిపెట్టా. సరే బాయిగడ్డ దగ్గిరికొచ్చా. ఒచ్చిడ్సిందే తంబ్రడిని ఏడుకొనా—సూర్యనారాయణా! అప్పాజీ నేను నాగులకు తని పొయ్యాల—నువ్వేమి కావాల్లోఅంతానాకిక్కడ ప్రోచ్చనంనేసి నాశాపం విమోచనం చేసి నాకుఇచ్చెయ్యల్లప్పా అంటాది తంబ్రడిని అడుక్కొనా. అప్పుడేమినేసాబంగారు కటారు చెంబు, బంగారుతట్ట ఈయమ్మకు మంచి పట్టుపీతాంబరము అంతాను పెట్టా సామి అక్కడేను పోక్షణం నేసా కూతురుమింద. అపుడేమి నేనసీ శాపము

రెండు బాగాలాయ అవుతానే ఈయమ్మ ఎంటనే వచ్చా ఈ సరాములు అవి పెట్టి డిసా. సరిబాయిలోకి దిగా. దిగిడిసిందే స్నానము సేసా. బంగారు పీతాంబరము తీస్కోని పొయ్యి స్నానము చేసా ఏడు బార్లు ఎంటికలు సరే తానము సేసి వచ్చి జీవమానము మొదలుకోని ఇచ్చుండాడు తండ్రి. అపుడు ఆ ఏడుబార్లు ఎంటికలు తల దువ్వుకోని, జడేసుకోని, ఆ పీతాంబరము కట్టుకోని రైక తొడుక్కోని, ఆభరణాలంతాను ఏస్కోని అపుడు ఆచెంబుల నీళ్ళు నింపుకోని తట్ట తీస్కోని పుట్ట దగ్గరికి ఒచ్చా. నాగుల్కేమి కావాలో అంతా ఇచ్చి పంపించిందాయ. అమిటికి దారాలు. పత్తి, గజ్జొత్తి అంతా నాగులుకు చుట్టొచ్చా. చుట్టేసి అంతా ఎలేశా ఎలేసి పసుపు కుంకుము పెట్టా, అపుడు టెడ్డీకర్పూరాలంతా అంటించి ఏమి మునుగుతా వుండి సామి ఇచ్చంపించి. అపుడు ఈయమ్మ టెంకాయకొట్టి, పసుపు కుంకుము పెట్టి మూరు సర్తులు ప్రదచ్చినేసా. స్వామికి నాగేంద్రునికి కాయికొాటే తపుతు స్వామి ఏడుతలల నాగేంద్రుడు పుట్లోంచి ఒస్తాడు ఒచ్చేదీని అపుడు స్వామిని ఎరుస్కోంటుంది. ఈయమ్మ బీము బాగా ఆనందంగా పూజచేశా ఆయప్పనికి నాగులగు, ఈ పాలు పుట్టలోపోసి. నెయ్యి, పాలు అంతా పెట్టా. ఆ నాగేంద్రుడు తాగా, తాగ్గానే పూజంతా ఆయ. ఆయమ్మకి ఏడుతలలు నాగేంద్రుడు ఆశీర్వాదము సేసా. సేసిడిసి సరి నమస్కారము ఈయమ్మ చేశా పుట్టకి సేస్తానే లోపలికి పోయిడిసా. పోతానే ఇంగా సానా ప్రైమయ్యి పోతుందని అంతా బుట్లో పెట్కోని బాయి దగ్గరికి వచ్చా వచ్చిందేసరి తల్లడీ నాకు శాపము ఇమో సనము సెయ్యాల అనా, అవుడు సర్ములు ఏస్కోనిడిశా. ఎస్కొంటానే తటక్కన పెండ్లిగుమ్మ అయిపాయ, సరి, బుట్టి తగలేస్కోనిడిసా. పొయ్యి ఎవుతెవుడు జనములోకి పోతాననేటప్పటికి యారే ఒక పట్నంనించి ఒకరాజు కొడుకూ, ఒక మంత్రీ ఇద్దూ యాటమార్గము వస్తాఉండారు. ఈయమ్మ ఈసరములన్నీ సూసేతప్పటికి రాజు కంటికి మించి పోయినట్లయిపాయ ఈయమ్మ రూపము. సరీ ఇక పయ్యిందే. పొద్దు ముందుగా సేరుకానేకి ఎల్లిపోతా ఉంది. సరి ఈరిద్దరుగూడా జోరుగా విమానాలు ఇడిసిరి. పెండ్లి గుమ్మ ముందర ఈల్లు ఎనకా పోతాఉండారు. పోతాఉంటే ఈయమ్మేమి సేసా, ఎల్లిపాయ. ఎల్లి పొయ్యిందే పూరింట్లో తాటాకు గుడిస్లోకి ఏల్లిపాయ. ఎల్లిపాతానే ఈల్లూ పొయ్యి

ఇద్రూను. పొయ్యిందే ముసలమ్మ వాట్లో కూకోనిందా అడుగోలజ్జీ అమ్మా ముస లమ్మా వెండ్లి గుమ్మొచ్చా, ఎక్కడ బాయినమ్మ అనా. మాయింట్లో ఎవ్రు లేరు సామి అనా—అమ్మా నీక్కావలసినంత ఎండిస్తాము. మాకా వెండ్లి గుమ్మ ఇయ్యాల అనా, ఇస్తాలే స్వామి అనా. అపుడేమి సేసా వెండ్లి గుమ్మని సేతికిచ్చి పట్టిపంపా సరే ఈయమ్మకి కావలసిందిచ్చేసి. గుర్రము మింద కూచోపెటోక్కని సరిపట్నా నికి ఎల్లిపోయి.

ఎల్లిపొయ్యిందే తల్లినిసూశా రాజు. అమ్మ, అమ్మ, రా అనా, తల్లి ఒచ్చా. ఈ వెండ్లిగుమ్మని సూసిందాయ. అమ్మా లేని తట్టేసి తిండి పెట్టమ్మ అనా. ఏమిటి కష్టా ఈ వెండ్లిగుమ్మని తెచ్చుండావు అనా. ఉన్నీ పెట్టన్నా అనా. సరే యిట్లే దానికి సంకటి ముద్దు, తవుడు కలిపేది ఒక బాణ్లిలో ఈ తట్టు వాకిట్లో పెట్టేది. పెట్టితే అది తినీనా సరి కాక్లు,నక్లు, జీవాలు తినేస్తాఉండా, సరే ఇట్లే కాలం సేస్తా ఉండా. సేస్తాఉంటే. నాగులకు తనిసేసిన్నాకు పోస్కోని తానము సేసింది అనంటాని ఈయమ్మ పడుకొనే రూములోనే బచ్చలిల్లు ఉండేది. మంచి పన్నెండు గంట్లకి లేశా. మెత్తగా వాకిలి తీస్కోనా లోపలికి ఎల్లిపాయ నీళ్ళంట్లోకి పొయ్యిందే సూశా తండ్రిని అనుకోనా ఈ శాపము ఇమోచనము ఆయ అందా పొయ్యి పైకి అగ్గేసిడిశా నీల్లు కాంచా. కాంచి నీల్లేసుకోని తానము సేసా తానము సేసి ఆమీక్కి తలదూచా, జడేసుకోనా, సెక్కసుట్టు కొనిడిసా. సెక్క సుట్టుకోనిడిసి లోపల్కి పొయ్యే తవిడికి పట్టపగలయి పాయ ఇల్లంతాను. అవుతానే పొయ్యి ఎంటుకులు పట్టుకొనేకి పొతాడు మొగుడు. సామి నన్ను ముట్టొద్దు అంటుంది. యాల అంటాడు నాకి శాపము మాతండ్రి దగ్గరికి పోదాము నన్ను ముట్టుకోవద్దు అంటుంది. అపుడేమి సేస్తుంది. ఈయప్ప ముట్టుకోకుండా ఎల్లిపోతాడు. ఈయమ్మ యతా ప్రకారము గొత్తులో నిల్సుకొంటుంద. సరి మీతండ్రిని ఎప్పుడు సూస్తావు అనా. రేపు పోదాము అనా అయమ్మ.

సరే అప్డేమి సేస్తారు తల్లికి చెప్పావచ్చి అమ్మా బిరీన నీళ్ళు కాంచమ్మ సానము సేయాల. నాకేమన్న తిండి పలారము చెయ్యమ్మ అని చెప్పొచ్చిందాయ. ఆయమ్మ బచ్చలింట్లో నీళ్ళ మంటేశా. సానము చేశా, బోంచేశా, పలారము, పాలు తాగా. అమ్మా నేనింక పొయ్యొస్తాను, నువ్వేమి దిగులు పడొద్దు అనా. సరి వచ్చా వెండ్లిగుమ్మని గుర్రంమీద కూకోబెట్టుకోని తోటోక్కని పోతుంది. మంచి హరణ్యా నికిపాయ. పోతే ఇంగా యాతావ నీపుట్నిల్లుండేది అనా అప్పుడేమి సేస్తుంది

దించు ఇక్డా అనా. మంచి హరణ్యములో దించేదిని అప్పుడు ఈయమ్మ పెండ్లి గుమ్మ ఏడుకొంటుంది. ఏడుకొనే తపటికి లోపుల్నింకా పీళ్ళుండే జాగాకి మెట్లయి పోతానే అప్డు మెట్లయిమిందుకు పొతారు. మొగిణ్ణి కూకోపెట్టుకోని పెండ్లిగుమ్మ పోతాయి. పొయ్యిండే అక్కడ దించా దగ్గిర. దించిడిసిందే సామి సువ్నిక్కడే ఉండు అనా. సరి పెండ్లిగుమ్మ సీదా లోగిల్లోకి పొయ. పొయ్యిండే తండ్రి దగ్గర కూకోనా పెండ్లిగుమ్మ. ఏమ్మా పండెండేండ్లు సరిగాయ ఎట్ల తెలిశా నీకు రామ్మ అంటాని కూకోపెట్కోని శాపము ఇమోసనము సేసా. సేసేసిందే ఏమమ్మా ఈటికి నీ శాపము ఇమోసనము ఆయా. ఇంగా నువ్వు ఒకరాజు కొడుకుని పెండ్లయి నీ రాజ్యము నీవు ఏల్కోవాలమ్మ ఇంతే నీయాజ్ఞ అంటాని తండ్రి సెప్పా. అప్డు అప్పాజీ! తోడ్కోని ఒచ్చుండాము అంటానా. మరి పిలమ్మా అనా, సూసా, సూని ఒప్పుకోనా. ఏమప్పా లగ్నము సేస్నా అనా. సెయ్యరా మామా అనా. అవుడేమి సేసా దేవానదేవతల్నంతా పిల్పించా. పిలిపిచ్చిందే ఈయమ్మకి లగ్నము సేసిడిసా. లగ్నము సేసి అప్డు ఒగనెల పెట్టుకోనా అడ ఇద్దర్నూను. ఏమిదిన్నము దేవుతులు ఈల్లకు సేవసేసేది. తొట్లులో తూగేది. ఇంత వైభోగముగా పెట్టుకోనా, పెట్టుకోని నెలయ్యేతప్కి ఈయమ్మికి ఇద్యంతా నేర్పించా. ఒగనెల్లోగా ఇద్యంతా నేర్చుకోనా, నేర్చుకోని అమ్మ ఇంగింతే నీ శాపము అమ్మ దేవుడు పెట్టిన శాపము ఇంతేనమ్మ అనా. నరలోకానికి పొయ్యి సుకంగా అనుబోవిచ్చమ్మ అంటాని అప్డేమి సేస్తాడు. నీకేమి కావాల్కో అంతా ఇచ్చినాను తీస్కోమ్మా అనా. సరే అల్లునికి కంటి హారాలు, చంద్రహారము, అనీ హారాలు అంతా ఇచ్చా, పీతాంబరం ఇచ్చా అల్లునికిచ్చా. అప్డు ఇద్దర్ని సాగేస్తాడు. సాగేసి బిడ్డకి, అల్లున్కి కూకోపెట్టి చెప్తాడు ఒక మైలు నేల పోతానే మీరు ఎనిక్కి తిరిగి సూడంతా అంటాడు. కానీ తండ్రీ అని సరెప్పయి, వచ్చి ఒక మైలు నేల, ఎనిక్కి తిరిగి సూస్రని. ఏమి ఆకాశానికి, భూమికి ఏకమై నరలుతా ఉంటుంది మంట. అవుడు ఇంద్రులోకము సేసిరి. ఇట్లా అత్తామామ నాకు నిక్కిపాయ్రి అంటా ఆయప్ప. నాకే తల్లీతండ్రీ ఇట్లావాళ్ళు నిక్కిపాయిరి. అని ఈయమ్మ ఏడుస్కోని నగర్కి పోతారు. పోతానే తల్లిని సూస్తారు. అప్డు తల్లీ తండ్రీఇద్రూ వస్తారు ఇంట్లోకి. వచ్చిందే ఈయమ్మను సూస్ద్ర ఆహా! ఎంత సుందరముగా ఉంది దేవతలే వచ్చుండారు మాయింటికాడికి. అంటానీ అప్పుడు భుజంమీద సెయ్యేసి అప్డు ఈయమ్మేమి సేస్తుంది. ఆమ్మా తల్లీ

సంకటి తవుడు నీకు ఏ స్తినిని అని కాళ్ళు పట్కోనేసి పోతుంది. అప్ప ఆయమ్మ సేత్లు పట్కోని అమ్మ నువ్వేమి సేస్తావు నాశాపం అట్లుందా. ఎవ్వరికేమి తెల్సును అంటాని అప్ప అత్తను శోకించి ఆడ్డేమి చేస్తారు ఈయమ్మకి లగ్గెం చేస్తారు. లగ్గంచేసి అప్ప ఈ ఆడుగోలజ్జీ ఉంచి సూడి. అట్లే తోడ్కోని. పొయ్యుంటారు. వచ్చే తవుడు, తండ్రి చెప్పి ఉంటాడు. మీతల్లిని తోడ్కోని పోయిసేవ చెయ్యమ్మ అంటాని తండ్రి చెప్పి ఉంటాడు. అప్ప రాజ్యభాగము ఈ యప్పనికి చెప్పివచ్చి అప్ప సుఖముగా వైభోగముగా ఉంటారు.

గొత్తు ప్రదేశం=గుర్తయిన స్థలం (సంకేత స్థలం)

బాణ్లి=బాణలి, అండా=హండా (పొయ్యి కుండ), నీళ్ళకాంచా=నీళ్ళు కాచింది, సెక్కు సుట్టుకో నిడీశా=కొప్పు పెట్టుకుంది, ఎరస్కొంటుంద=వేడుకొంటుంది, బీము=బియ్యం, ఆశీర్రాదం=ఆశీర్వాదం, సర్మొలు=సరములు (గొలుసు), యాట=వేట, వాక్లో కూకొనిండా=వాకిట్లో కూర్చొనిఉంది. ఆడుగోలజ్జీ=పూట కూళ్ళ పెద్దమ్మ, దీపాలంటించే పొద్దు=సాయంకాలం, ప్రోచ్చనం=ప్రోక్షణం, స్తానము=స్నానము, ఎంటికలు=వెంట్రుకలు, మూడు సర్తులు=మూడుసార్లు, ప్యాట=పేట, అమ్మలు=అంబలి, ఇంగా=ఇక, ఈతట్కి=ఈతట్టుకు ఈ ప్రక్కకు, తీర్థపడు=ప్రసవించు, నడినెత్తికొస్తే=సూర్యుడు నడినెత్తికి రావడమంటే (మధ్యాహ్నం కావడం అన్నమాట), తని=పాలు, బిరీన=తొందరగా [శీఘ్రంగా]. నీక్కాల=నీకెల, మది=మరి, (మళ్ళీ), పలారాలు=ఫలహారాలు సోధ్యం = చోద్యం, గడిసి తాకి = గుడిసె తావుకు [గుడిసె దగ్గరికి], కూనిడిసా=కూర్చొన్నాడు, హాన్యము=అరణ్యము, నెలయ్యే తర్కి=నెల అయ్యేటప్పటికి,

## 2. ఠింగు బుర్ర కథ

సేకరణ :
శ్రీ టి. నారాయణ
గొల్లపల్లె కోటూరు.

కథ చెప్పినవారు :
శ్రీ తగరం సుబ్రహ్మణ్యం
20 సం॥ గొల్లపల్లె కోటూరు

ఒగూర్లో ఒగ రాజంట. ఆరాజుకు ఒక పెండ్లాము, ఏడుగురు కొడుకులు.

పుట్టగోశంత భూమి ఉన్నెంట. ఆచేన్లో రాజు జొన్నలు చల్లతా ఉన్నెంట. జొన్నలు చల్లతా ఉంటే గూలొచ్చి ఏరక తినేస్తా ఉన్నెంట. అబ్బుడు, రాజు, పెండ్లాము, బిడ్లు గెనుంమింద కుచ్చోని ఏడస్తా ఉండిరంట. ఆదికొన మునిలాయ నొచ్చి ఏమినాయనా ఏడుస్తా ఉండారు, అనిఅడిగితే రాజుతాతా ఏమిచేసేది. నాకు వుట్టగోసెంత సేనుంది. ఏడుగురు బిడ్లు,ఒగ పెండ్లాము, సల్లిన జొన్నలంతా గూలు లింటా ఉండాయి. ఎట్ల బతికేది అని అడిగినంట అబ్బుడు ఆమునిలాయప్ప నాయనా నీకొక టింగుబుర్రిస్తాను. గూలొచ్చినబ్బుడు "గూలికొక టింగుబుర్ర" అను గూలన్ని సస్తాయి అన్నాడంట. అట్ల సెప్పేసి ఆతాత పూడిసినంట.

మళ్ళీ ఆ సేన్లోకి గూలొచ్చి వాలినంట. రాజు టింగు బుర్రెత్తుకోని గూల కంతా టింగుబుర్ర అన్నాడంట, అబ్బుడు గూలన్ని సచ్చి పొయ్యినంట, గూలు సచ్చిపోతా ఉన్నట్లే ఆ గూలన్నేరి పెండ్లాము సేతికి బిడ్లు సేతికిచ్చి, పిట్ని కాల్చి శారు సెయ్యంత అన్నెంట. పెండ్లాము, బిడ్లు యింటికి పొయ్యి గూల్ని కాల్చి నీ కొకంద, నాకొకంద అని తినేసిరంట

రాజు సేని కాట్నించి యింటికొచ్చి పెండ్లాన్ని కూర శారెద నాకెయ్యి అన్నే డంట. పెండ్లాము నీబిడ్లంతా తినేసిరి నేనేమి సేసేది అన్నెంట, అబ్బుడు రాజుకు కోపమొచ్చి నాబిడ్లకంతా టింగుబుర్ర అన్నెంట. మళ్ళా కొంచేపిటికి పక్కింటి మునిలాయమ్మ అగ్గ కొచ్చిందంట, అగ్గికొచ్చి సచ్చిపొయ్యిండే బిడ్లను సూని ఏమి నాయనా బంగారట్లా బిడ్లను సంపేసిందావు నీకేట్లా సేతులొచ్చె అన్నెంట.అబ్బుడు రాజుకు కోపమొచ్చి ఈ మునిలి దానికొక టింగు బుర్ర అన్నెంట. మునిలిది సచ్చి పొయ్యినంట. అబ్బుడు రాజు పెండ్లాము దీన్నంతా సూచి ఏమి సామి బిడ్లను సంపేస్తివి, మునిలిదాన్ని సంపేస్తివి అన్నెంట. అబ్బుడు రాజు పెండ్లాని కొగ టింగు బుర్ర అన్నెంట. అబ్బుడు రాజు పెండ్లాము గూడ సచ్చి పొయ్యినంట.

రాజు యిల్లొదిలేసి ఒగ పెండ్లి జరగతా ఉంటే ఆటికి పొయ్యినంట. ఆడుండేవాళ్ని అన్నం పెట్టమని అడిగినంట, అబ్బుడు వాళ్లు కొంచేపుండు అన్నము తింటా ఉండారు. మల్ల పెడతాము అనిరంట. రాజుకు చానా ఆకిలపతా ఉన్నెంట. అందుకు కోపమొచ్చి వీల్లుకంతా ఒక టింగుబుర్ర అన్నెంట, వాళ్ళంతా సచ్చి పొయ్యిరంట. సచ్చిపోతే రాజు ఆడుండే అన్నము మొత్తము తినేసి కడుపు పగిలి సచ్చి పొయ్యినంట.

అర్థ వివరణ :

గూలు=గువ్వలు (పిచ్చుకలు), ఉన్నెంట=ఉండెనంట, పూడిసినంట= వెళ్ళిపోయాడట, పొయ్యిడిసినంట అని అనంతపురం జిల్లా జానపదుల వ్యవహారం కూర శారెద = కూర చారు ఏది, సేని కాట్నుంచి = చేను దగ్గరినుంచి ఆడుండే వాల్ని = అక్కడున్న వాళ్ళను, సూచి = చూచి, చానా = చాల కొంచేపుండు=కొంచెము సేపు ఉండు, ఆకిలవతా=ఆకలి అవుతూ, అన్నెంట= అన్నాడట.

# 3. చంద్రదేశింగు రాజుకథ

సేకరణ :
శ్రీ టి. నారాయణ
గొబ్బిళ్ళ కోటూరు

కథ చెప్పినవారు :
శ్రీమతి రాగిపాలెం మునెమ్మ
65 సం॥, గొబ్బిళ్ళ కోటూరు
చిత్తూరు జిల్లా.

ఇస నగిరి పట్నమనే ఒగ పట్నమంట. ఆ రాజ్యాన్ని పాలించే ఆయన బోనుపాతువు రాజంట. ఆయనకు నలుగురు కొడుకులంట. నలుగురు కొడుకుల్లో ముగ్గురు పుట్టినబ్బుడు బతికెది చాల కష్టంగా ఉన్నెంట. నాలుగోవాడు పుట్టినంట పుడతానే, చెంద్రదేశింగు రాజని పేరు పెట్టిరంట. అన్ని సంపదలు కలిగినంట. అట్లుంటె పున్నమి ఎన్నెలనాడు పాలారపోసినట్లు ఎన్నెల కాస్తాఉన్నెంట. అబ్బుడు అల్ల తండైన బోనుపాతువు రాజు నలుగురు కొడుకులును పిలిసి ఈ కలిమి బలిమి ఎవరుగుండా వచ్చింది అన్నెంట. ముగ్గురు కొడుకులు తల్లితండ్రివల్ల కలిగింది అన్నెంట. అబ్బుడు తండ్రి అయినోడు కోపగించుకోని వీన్ని కారడవిలో నరికేసి నాకు కన్నుగుడ్లు సూపించండ్రా అని జవానులుకు సెప్పినంట. అబ్బుడు జవానులు చెంద్రదేశింగు రాజును పిలుసుకోని పోతాఉంటారంట. ఒగ అరణ్యమైన అడివిలోకి పోయి జవానులు అరెరె ఈ బిడ్డ కండ్లు తీసేయమనెనే వాల్లు నాయన ఆయన ఎంత లోభి అనుకోని ఒగ కుందేలును సంపి దాని కండ్లు తీసుకోని నువ్వేడికైనా పూడు నాయనా అని సెప్పిరంట. ఆ కుందేలు కండ్లు వాల్లు నాయ

నకు సూపించిరంట. అబ్బుడు బోనుపాశురాజు కండ్లలో నీల్లు పెట్టుకొన్నొంట అబ్బుడ్నుంచి వాల్లుకు తిన తిండిలేక సానా బీదోల్లయి పోయిరంట.

ఇట్లుంటే చెంద్రదేశింగురాజు ఆ ఆడవిలో రెయ్యంతా కాయి కసుర్లు తిని రెయ్యి ఒగ గవిలో దూరుకోని రాయి అడ్డము పెట్టుకోని పొనుకుంటా ఉన్నొంటా.

ఈ మాదిరి నివసిస్తా ఉంటాడు. ఒగ పట్టణాన్నుంచి ఒగ రాజు, ఒగ ఒగ మంత్రి వేటమార్గాన పొయ్యినారు. రాజుకు ఒగ కూతురు మంత్రికి ఒగ కొడుకు, వాల్లిద్దరు పల్లిగుటములో సదవతా ఉండారు. ఆ బిడ్డకు, మంత్రి కొడుక్కు సానా సినేహితము. అబ్బుడు రాజు మంత్రి వేటకు పొయ్యిరి, వేట పోయి అడివంతా తిరుక్కోని. నీల్లు దప్పికి ఒక మాను కింద కూర్చోండాడు. రాజు. కూర్చోని ఒరే మంత్రి నాకు నీల్లు తేండిరా అన్నాడు. అబ్బుడు వీల్లు నీల్లుకు అడివంతా ఎతుక్కోని పోతా ఉండారు. అబ్బుడు వీల్లును సూసిందే చెంద్రదేశింగురాజు గవిలో దూరుకోని గుండుని గవికి అడ్డము తోసినాడు. అబ్బుడు ఆ మంత్రి ఇదంతా సూసి ఓ నాయనా ! నాకు ఒగే ఒగ కొడుకు నువ్వుబయటికొస్తే నిన్ను నా పెద్దకొడుకు మాదిరిగా సూసుకొంటాను అని వేడుకొంటాడు. ఇది సూచి చెంద్రదేశింగు రాజు ఎడమ కాలి బొటనవేలితో గుండును తోసి బయటకొస్తాడు. రాజుకు ఈ విషయం చెప్పి ఆ పిల్లోణ్ణి పట్టణానికి తీసికొస్తాడు. భార్య చేతికిచ్చి ఈ బిడ్డ తలకాయి నొస్తే నీ తలకాయి తీ సేస్తానని చెప్పుతాడు, ఆమె కొడుక్కన్న ఎక్కువగానే బిడ్డను సాకతా ఉంటుంది, రాజు కూతురు, మంత్రి కొడుకు, చెంద్రదేశింగురాజు పల్లెకూటానికి పోతా ఉండారు. రాజు కూతురు, మంత్రికొడుకు చెంద్రదేశింగురాజు బాగా సదవలేదని కొట్టతా ఉండిరి. ఇట్లుంటే రాజు, మంత్రి వాల్లు బిడ్డను దండిస్తా ఉండిరి. అబ్బుడు రాజు కూతురు ప్రవుక్తరాలయింది. అబ్బుడేమో మంత్రి కొడుకుతో మాట్లాడగూడదని రాజు కూతురుతో సెప్పినంట.

ఒకనాడు రాజుకూతురు ఒగ సీటురాసి ఊరికి ఉత్తరానుండే రాగిసెట్టు కిందికి రమ్మనిందింట ఏడికైన పూడద్దామని. రాసి ఏమిసేసింది. ఈ సీటును చెంద్రదేశింగురాజు సేతికిచ్చింది. సదువుతెలీదని. కాని చెంద్రదేశింగు రాజు అంతా సదువుకోని రాత్రికాగానే మంత్రికొడుక్కి బదులు తానేపోయి రాజు కూతురుని, నీలవేణి అనేదాదిని గుర్రము మింద పెట్టుకోని కొట్టేదాడు. కొట్టి

పోయె పోయె ఒక పట్నము సమీపానికి పోయె. పొయ్యి గుర్రాన్ని నిలిపె. అబ్బుడు సూసింది రాజు కూతురు చంద్రదేశింగురాజును. సూచి ఏమే నీలవేణి వీడు మోసము చేసినాడు దిగే గుర్రము అనింది. నీలవేణి అబ్బుడు అక్కా యింతదూరము మనము రాత్రిలోవచ్చి ఎనక్కుపోతే మన నాయన ఏటికి పోయింటిరి అంటే మనము ఏమని సెప్పేది అనింది. ఈయన మాత్రము మనిషికాడా ఈయనతోనే పోదామంది. అట్లైన్నెంక అయితే నా కన్నము కావాలని రాజు కూతురు నీలవేణితో సెప్పింది. అబ్బుడు ఆ నీలవేణి అనే దాసెమూమ అక్కకు అన్నము కావాలంట అనింది. రాజు గుర్రము దిగి ఒక వంక గుండా అడివిలో పోతాఉండాడు. పోతే ఆడ ఒగ బ్రహ్మరాక్షసి ఐదు దినాలు దేవకన్యను తీసికోనొచ్చిందంట. ఆయమ్మకు యిబ్బుడు పంద్రెండు ఏండ్లంట. ఆ రాక్షసి ఈ 12 ఏండ్లుగా ఎట్లా జీవిస్తా ఉందెంట. గవిలో బిడ్డ తలనరికి సముద్రానికి పోయి పీనిగులు, ఏనుగులు తిని, మల్లా గవికొచ్చి బిడ్డ మొండానికి తలచేర్చి బెత్తము అంటించి బతికిస్తా ఉన్నెంట. బతికించి ఆ బిడ్డచేత పుట్టెడన్నము, సారువండించి తినేసి మల్లా తలనరికి సముద్రానికి పోతా ఉన్నెంట. ఇట్లా తలనరికి నబ్బుడు కారినరక్తము రాజు పోతాఉండే ఏరెంట పారి బంగారుదీవి మొనలుగా అయ్యిన్నంట.

చెంద్రదేశింగు రాజు ఆవంకెంట పోతా ఉంది. నీల్లుకని సెలిమి తీసెనంట సెలిమి తీస్తే, దాంట్లో రెండు బంగారు మొనలు సిక్కినంట. ఆ బంగారు మొనలుని ఒగ కోమిటోని కమ్మి సరుకులు తీసుకోని ఆ కోమిటోని కుండే ఏడంతస్తుల మాడిలో నీలవేణిని రాజుకూతురుని పెట్టినాడు. రాజు, రాజుకూతురు మాట్లాడేదిలేదు. వీల్లుకు నడిమిద్ద అన్నీ చేసిపెట్టేది.

ఇట్లుంటే ఆ పట్నంలో ఒగరాజంట. ఆయనకు ఒకే కూతురంట. ఆమె దగ్గర రామన్న, భీమన్న అనే రెండు సిలకలున్నెంట. కోమటోడు ఆ బంగారు దీవి మొనల్ని రాజు కమ్మతాడు రాజు అవిట్ని కూతురు మంచానికి రెండు కాళ్ళుకి రెండు పెడతాడు. అబ్బుడు రామన్న భీమన్నతో యిగ రెండుమొనలు రెండు కాల్లుకి పెడితే మన రాజుకూతురు దేవకన్యతో సమానంగా ఉంటుంది అనంటుంది. రాజుకూతురు ఇదంతా యిని రాజుని ఆ బంగారు మొనలు తెమ్మంటుంది. రాజు కోమిటోనికి సెప్పుతాడు. కోమిటోడు చెంద్రదేశింగు

రాజు పద్దైదుదినాల్లో తెస్తానని సెప్పి, సీలవేణికి సెప్పి మల్లా ఆ వంక దగ్గరకు పోయినంట. పోతే ఆ వంకకు రాక్షసుండే గదికి ఒగే బాట మాదిరి కనిపించినంట. చంద్రదేశింగు రాజు బాటంటపోయి గవిని చేరుకొన్నెంట. గవిలోతల ఉట్టిలో మొండెము క్రిందా ఉండాయంట. అబ్బుడు ఈయన ఏమి సిత్రమో సూడాలని బంగారు బల్లై గవికి కరుసుకోనుండాడంట. అబ్బుడు బ్రహ్మ రాక్షిసి వచ్చి తలమొండెము ఒకచోట సేర్చి బెత్తెము తాకించిందంట. బిడ్డలేసి కూర్చొన్నెంట. కూర్చొంటా ఉన్నెట్లె ఏమె నరవాసన వస్తా ఉంది అన్నెంట. ఆ దేవకన్య నరుడెట్లావోడో తెలీదు అన్నెంట. అబ్బుడు ఆదేవకన్య రాక్షిసికి ఆగారము వండి పెట్టినంట. అది తిని మల్లా ఆబిడ్డ తలనరికి సముద్రానికి, ఆగారానికి పొయ్యినంట.

అదిపోతా ఉన్నెట్లె బల్లిగా ఉండె రాజుకొడుకు మనిషిగామారి తల మొండెము ఒగచోట్లో పెట్టి ఆ బిడ్డకు బెత్తము తాకించి బతికించినంట. బతికించి దేవకన్యను ఆ బ్రహ్మరాక్షేసి పానము ఎడుందో కనుక్కోమంటాడు. ఆ యమ్మను ఒప్పించి తలనరికి బల్లై గోడకు కరుసుకొంటాడు. రాక్షేసి మల్లా వచ్చింది. వచ్చి నరగాలి, నరగాలి అనింది. అని బెత్తముతో దేవకన్యను బతికించింది. దేవకన్య పీనుగులు తినుండావు అందుకే నరగాలి కంపు వస్తా ఉంది అని ఒప్పించి దానికి ఆగారము వండి పెట్టింది. అది తింటా ఉంటే అమ్మా అమ్మా నీవు నెన్న నరగాలి అంటివి, ఈ పొద్దు నరగాలి అంటివి నాకు భయంగా ఉంది నీ పానము ఏడుందో సెప్పు అంటుంది. అబ్బుడు ఆ రాక్షేసి గట్టిగా నవ్వి ఈడేడుండే నా పానము ఈ కొండల కవతల ఒగ ఎర్రకొండుంది. ఆ ఎర్రకొండలో ఒగ గవి. దాంట్లో ఒక బంగారు పంజరము. ఆ పంజరములో ఒగ సిలక. దాంట్లో నా పానముందని సెప్పి ఆగారము తిని దేవకన్య తలనరికి సముద్రానికి పోతుంది.

అబ్బుడు రాజు పిడికెడు రాగాకు ఎత్తుకుండె, ఒగ కోడిగుడ్డు, పుట్ట కూడు, మేకకూర ఎత్తుకోని మొదిటి కొండకు పాయ. ఆవు అడ్డమొచ్చి కుమ్మ నొచ్చె. దానికంత కసువేసె. ఆవు పక్కకు తప్పుకుండె. రెండో కొండకు

పోయె. పాము వచ్చె, పాముకు గుడ్డేసె. అది తప్పుకుండె. మూడో కొండకు పోయె. ఎలుంగొడ్డొచ్చె. దానికి వుట్ట కూడేసె. అది తప్పుకుండె. నాలుగో కొండలో నక్క, అయిదో కొండలో పులి అడ్డమొచ్చె. అవిటికి మేకు్కారేసె. అవి తప్పుకుండె ఎర్ర కొండలో ఉండె సిలకును ఎత్తుకోనె. అబ్బుడు రాక్షసి నన్ను సంపొద్దని చంద్రదేశింగు రాజు దగ్గరికి వస్తుంది. చంద్రదేశింగు రాజు సిలకను సంపి గెవికొచ్చి దేవకన్యతో పట్టణానికి పోతాడు. పోయి దేవ కన్యను నరికి రక్తంతో దీపి మొనలను మూటకట్టతాడు. కట్టి ఆయమ్మను బంగారు బెత్తంతో బతికిస్తాడు. ఆయమ్మను మాదిలోనే పెట్టతాడు.

ఈ బంగారు దీపి మొనలను ఎత్తుకొనిపోయి కోమిటోని కిస్తాడు. వాడు రాజుకిస్తాడు. రాజు తన కూతురు మంచము కాల్లుకి, రెండు మొసలను పెడ తాడు. అది సూచి సిలకలు మనక్కకు నవపొన్నపూలు పాన్పువేస్తే మనక్క వైభోగము దేవేంద్రునితో సరి అని అంటాయి. అది విని రాజుకూతురు అలిగి రాజును నవపొన్నపూలు తెమ్మంటుంది. రాజు కోమిటోనికి సెప్పుతాడు. కోమిటోడు చంద్రదేశింగు రాజుకి సెప్పుతాడు. చంద్రదేశింగురాజు దేవ కన్యతో నవపొన్నలు కావాలంటాడు. అందుకాయమ్మ దానికి ఒగ ఉపాయము సెప్పి అట్ల సేయమంటుంది.

రాజునేరుగా ఉత్తర మార్గాన దేవకన్య సెప్పినట్లు పోతాడు. ఎమికిలు కొండ దగ్గరకు పోతా ఉన్నెట్లె ఎమికిలన్నీ కరిగిపోయె. జీవ కొండకు పోయె. కండలంతా కరిగిపోయె, ప్రాణకొండకు పోయె, పానముపోయె. అబ్బుడు ఆటికి, ఈ దేవకన్య అక్కోల్లుఆటికొచ్చి ఈ దేశింగు రాజుకు పాణముపోసి అన్నము తినమంటారు. వాల్లు తింటె, తను తింటానంటాడు. మొరుగ్గా ఎంగిలి చేసి, ఆ ఎంగిలన్నాన్ని వాల్లుకి తినిపించి తన వశము చేసు కొంటాడు. చేసుకోని వాళ్ళ చెల్లెలు దేవకన్యకథ, తనకు కావలసిన నవపొన్న పూలు కథ చెప్పుతాడు.

అబ్బుడు వాల్లు ఇసక మంత్రించి నాగలోకానికి పొమ్మంటాడు. నాగ లోకంలో నాగుపాముపైన ఈ యిసుక సెల్లు అని సెపుతారు. అట్లే అని నాగలోకానికొచ్చి పాములుపైన ఇసకసల్లి దేవకన్యలు చెప్పినట్ల వాల్లు తంద్రితో మూడు రాత్రులు మూడు పగల్లు తెలీకుండా ఎంగిలి కలిపి వాల్లిచ్చిన సీటు

ఇస్తాడు. అబ్బుడు వాల్లు తండ్రి ఆ సీటును సూచి దేవలోకానికి తన పెద్ద కూతురికి సీటు రానిస్తాడు. తన పెద్దకూతురు కంటికి కనపడకుండా ఎంగిలి కలపమంటాడు.

అబ్బుడు చంద్రదేశింగురాజు దేవలోకానికి పోయి బంగారుబల్లై పెద్ద దేవ కన్యతో ఎంగిలి కలుపుతాడు. కలిపి నవపొన్న పూలు అడుగుతాడు. ఆయమ్మ తన ఐదుమంది సెల్లెండ్లు దగ్గరకొచ్చి మనమంతా నరుని పాలవితి మని ఏడుసుకోని పట్టణానికొస్తారు. అబ్బుడు కోమిటోడొచ్చి నవపొన్నలు అడగతాడు. చంద్రదేశింగురాజు పెద్దదేవకన్యను అడగతాడు. పెద్ద దేవకన్య నవ్వుతుంది. ఆమె నవ్వుతానే నవ పొన్న పూలు రాలతాయి. అవిటెని కోమిటోని కిస్తాడు. కోమిటోడు రాజుకిచ్చె. రాజు కూతురు మంచానికి పరిసినాడు. అబ్బుడు సిలకలు మనక్కకు యింతా సేసిన రాజుని మనక్క పెండ్లాడితే, మనక్కకు యింకేమి వద్దంటాయి. అబ్బుడు రాజు కూతురలిగి రాజుతో చెబుతుంది. రాజు చంద్రదేశింగు రాజుని పిలనంపి కూతురుని పెండ్లి చేసుకోమంటాడు. చంద్రదేశింగురాజు తన రాజు కూతురుని అడిగివస్తానని చెప్పి, నీలవేణితో రాజు కూతురుని పెండ్లి చేసుకుంటా నంటాడు. అబ్బుడు తన రాజుకూతురడ్డమొచ్చి మొదట తనను పెండ్లాడి తరువాత అందరిని పెండ్లాడమని తనేరాజుతో మాట్లాడుతుంది. మల్లరాజు అందరిని అదేవిధంగా అడిగి ఏడుగురు దేవకన్యలను, యిద్దురు రాజుకూతుర్లను, ఒగదాదిని పెండ్లాడి రంగ రంగ వైభోగంగా బతకతాడు. ఇట్లుంటె ఒకనాడు కట్లమ్ముకోని వాల్లమ్మనాయన కనిపిస్తారు. అబ్బుడు చంద్రదేశింగురాజు వాటిని కసుకోని సేరదీసి లచ్చనంగా బతకతాడు.

అర్థ వివరణ :

అన్నెంట = అనెనంట (అన్నాడట), నువ్వేడికైనా పూడు = నీ వెక్కడికైనా వెళ్ళిపో (పూడు = పోయివిడు = పోయిడు), రెయ్యంతా = రేయి అంతా [రేత్రంతా], గవి = గుహ, పొనుకుంటా ఉన్నెంట = పడు కొంటా ఉండెనంట,పల్లిగుటము = స్కూలు, సినేహితము = స్నేహము,సూ సిందే= చూడగానే,సూచి = చూసి, పిల్లోణ్ణి = పిల్లవాడిని,వాల్లు= వాళ్ళు, ప్రవర్త రాలు = పుష్పవతి,(సమర్త)సీటు= చీటీ,ఏడికైనాపూడద్దామని = ఎక్కడికైనా

వెళ్ళిపోదామని (పూడ = పోయివిడు = పోయిడు). యిబ్బుడు = ఇప్పుడు, మాడి = మేడ, పుట్టకూడు = పుట్టెడుకూడు, కుమ్మనొచ్చె = కుమ్మడానికి వచ్చింది, కసువు = గడ్డి, అవిటికి = వాటికి, సిలకు = చిలక, ఎమికిలు = ఎముకలు, పాణము = ప్రాణం.

# 4. కుందేలు - ఉడత కథ

సేకరణ :

శ్రీ కె. సీతారామయ్య
హోసూరు.

కథ చెప్పినవారు

శ్రీమతి మల్లమ్మ, వయసు 35 సం॥
కొత్త జీగూరు, హోసూరు తా॥
ధర్మపురి జిల్లా, తమిళనాడు.

ఒగ అడవిలో ఒగ కుందేలు, ఒగ ఉడత శానా నేస్తముగా ఒగే గుహలో శానా ఏండ్లుగా బదుకుతా వుండె. అవి రెండు పాణాలు ఎబుడూను ఒగే పొద్దులో మేతకు పోతావుండె. ఒగనాడు కుందేలు ఇంటికి సేరేది. నిదానమాయ. ఉడత దినాము వస్తావుండే పొద్దుకే వచ్చి ఇంట్లో సూస్తే కుందేలు వచ్చిండ్లేదు ఎంతసేపు సూసినా కుందేలు దిక్కే కనుబిచ్చలేదు. ఉడతకు కుందేలంటే పాణం. పావ్మ ఉడత సంగటి కూడా తినకుండా కుందేలును తడుకోక్కని వచ్చేదానికి అడివికి పాయ. ఆ యడవి శానా గుబురుగా వుండే దాన్నుంచి యా సెట్టుకింద ఉందో లేదా యా గుడ్డ కింద వుందో సెప్పేకె కష్టమాయ. పోతా పోతా అద్ది అడవి నడీమద్దెకి పోయ. అక్కడ ఒగ మర్రి సెట్టుండె. ఉడత మర్రి సెట్టెక్కి నూడాలని ఎక్కె. దాని తొట్టిలో ఎవరో మాట్లాడతా వుండి. అక్కడికి పోయి సూస్తే ఒగ పెద్ద రాచ్చాసి. దాని సుట్టూ మనుసుల్ని అంటి పండ్లు మాద్రి మింగతా వుంది. అది నల్లగా, దప్పముగా, ఎంటికె లిరిబోస్కోని కూకోనుండే. నూసేకే దిగులవుతుంది. ఆ తొట్టిలో యాడ సూసినా రత్నాలు, ముత్యాలు, బంగారు కాసులు దాన్నెము రాసులు పోసింది.

ఉడుత అదిసూసి కుందేలు జ్యానమే మరిసి పోయిడిసె. ఏమన్నా సేసి ఈ రాచ్చాసిని సంపి దాన్నంతా నేను అనుబోగియ్యాల అనుకోని ఏమేమో యోసన సేసింది. యేసిన సేసి సేసి, ఆమీటిక్కి ఒగ దావకి ఎచ్చింది.అంతలోగా దూరము

నించి ఒక కుందేలు దానికి కనబడె. అది ఏవరో కాదు. పాపము ఉడతను ఎదుక్కోని వస్తా వుండె. దాని జతదే అది. కాని ఉడత కాసుపైన ఆశపడి కుందేలును గుర్తుపట్నలేదు. మెల్లగా దాని దగ్గరకు పోయి నీవు నేను ఒగటై ఆ రాచ్చసిని సంపి సొత్తంతా అనుబోగిస్తామని సెప్పె. తెలీనట్లే మట్లాడంగా కుందేలుకూడా ఉడతను గుర్తుపట్టలేదు. అది ఎవరో అనుకొనే గాని దానికి శానా కోపమొచ్చె ఉడత మాటలకు. యాల తెలుస్నా ? ఆ రాచ్చాసి కుందేలుకు శానా కావల్సింది. ఆ కోపముతో ఉడతను సెంపి దాని చర్మము ఒలిసి లోపలికి పోయి రాచ్చానికి సెప్పె రాచ్చాసి సంతోసపడి నాకు వయస్సయిపోయ. నేను సచ్చి పోతాను. నువు ఈ కాసంత ఎత్కోని పోయి అనుబోగించు అని సెప్పి సచ్చిపోయ.

పాపం కుందేలుకు తన సినేహితుడు ఉడత లేదని సింత. తిరిగి దాన్ని ఎదుక్కోనివచ్చె. ఆ మీట్కొ తెలిసె తాను సెంపింది తన నేస్తగాణ్ణి అని. కుందేలు ఏడ్సి ఇంత జతగా వుండిన నా జతగాడె పోయ నేనుండీ ఏముద్దారకము అని కట్లు తెచ్చి మండేసి దాంట్లో పడి సచ్చిపోయ. ఆమూడు పాణాలు మంట్లో. మనమింట్లో !

అర్థ వివరణ :

ఒగ = ఒక, శానా = చాలా, ఎబుడును=ఎప్పుడూను వచ్చిండ్లేదు= రాలేదు, కనుబిచ్చలేదు = కన్పించలేదు పాప్మ = పాపం, తదుక్కోని = వెతుకుకొని (వెతుక్కుంటూ) వుండేదాన్నుంచి = ఉండడంవల్ల, గుడ్డ = గుట్ట నడీమద్దెకి = నడమధ్యకి, రాచ్చాసి = రాక్షసి, ఎంటికెలిరిబోస్కోని=వెంట్రుకలు విరబోసుకొని, మనుసుల్ని =మనుష్యులను, ఆంటిపండ్లు మాది = అరటి పళ్ళు మాదిరి, దప్పము=లావు, కాసులు = డబ్బులు (ధనం), దాన్నెము = ధాన్యం, జ్యానము = జ్ఞానం, మరిసిపోయిడిసే = మరచిపోయింది, అనుబో గియ్యాల = అనుభవించాలి, యోసన = ఆలోచన, ఎదుక్కోని=వెతుక్కుంటూ యాల తెలుస్నా=ఎందుకో తెలుసా?, సినేహితుడు=స్నేహితుడు, సింత=చింత ఆమీట్కొ = ఆ మీదట, ఉద్దారకము=ఉద్ధారము, కట్లు=కట్టెలు, మండేసి = మంటవేసి, మంట్లొ = మంటలో.

# 5. దాసప్ప - గుళ్ళనక్క

సేకరణ :

శ్రీ కె. సీతారామయ్య

హోసూరు

కథ చెప్పినవారు :

శ్రీమతి కెంచమ్మ, 40 సం॥లు

పూనపల్లి, హోసూరు తాలుక,

ధర్మపురి జిల్లా, తమిళనాడు.

ఒగూర్లో ఒగ దాసప్ప. ఆ దాసప్పకు పెండ్లాము, ఒగ కొడుకు వుండ్రి. వాళ్ళు బిచ్చమెత్తుకొని ఊరూరు తిరుగతావుండ్రి. ఒగనాడు వాళ్ళు ఒగ గౌని ఇంటిదగ్గరకు వచ్చిరి. ఆ గౌనికి ఒగ కొడుకు. గౌడు వాళ్లకొగ ఇల్లు యిచ్చె. ఒగ యాడాది వుండి దాసప్ప వాని పెండ్లాము సచ్చిపోయిరి. వాళ్ళ ఇద్దరినీ మన్ను చేసిరి. ఆ మీటకు దాసప్ప కొడుకు గౌని కొడుకు గుద్దిలి ఎత్తుకొనిపోయి అక్కడ ఒగ గుంత కొట్టిరి. సంతకుపోయి దోస ఇత్తులు తెచ్చిరి. దానిని ఆ గుంతలో పూడ్చిరి. దాంటిలో గాయలు బాగా యిడిసె. దాన్ని పెరికి ఏడుబండ్లలో తోలుకొని పోయి సంతలో అమ్ముకొనివచ్చిరి. ఆ దుడ్డును గౌని పెండ్లాము నేతికిచ్చిరి.

ఆ దోసకాయలు సెట్టుని గుళ్ళ నక్కలు సూసి అంతా తినేసె. వాళ్ళు గుడిసెలు ఏసి కావలుండిరి. గుళ్ళనక్క ఒగనాడు దాన్ని తినేకివచ్చె. వాళ్ళు కొట్టేకి పోయి ఆ మీటకు ఆ గుళ్ళనక్క నన్ని కొట్టద్దు. నేను ఇంగు మీట మీ దోస సెట్టుకు కావలుంటాను అనె. ఆ దాసప్పకొడుకుగౌని పెండ్లాముకు సెప్పితే వాళ్ళు నగిరి కాని దినాము దాసప్ప గుళ్ళనక్కకు సంగటి ఎత్కోని పోయి పెడతా వుండె.

ఒగనాడు గుళ్ళనక్క నీకు ఒక పడుసును తెచ్చి పెండ్లి నేస్తానుండు అని సెప్పి పోయ. పోయి పోయి ఒకరాజు యింటికి పోయి రాజుగారుండారా అని అడిగె. దాదులు రాజుకు గుళ్ళబావ వచ్చిందాడని సెప్పిరి. రాజు పిలిచి అడిగె. గుళ్ళ నక్క మీ యింట్లో ఒగ ఆడబిడ్డ వుంది. ఆ బిడ్డను మా చిన్నవానికియ్యి అని సెప్పె. రాజుకు ఆచ్చర్యము సంతోషము ఆయ. సరే అనె. ఇంగ పేము వచ్చేలేదు. ఎనిమిన్నాళ్లకు బిడ్డను తోడుకొని మీరే రావాల అనిసెప్పి గుళ్ళనక్క వచ్చేడ్సె.

రాజు బిడ్డని తోడ్కొని వచ్చె. మాది ఏడు మిద్దెల యిల్లు అని సెప్పిండె గుళ్ళనక్క. వారు సూస్తే తాటాకులు గుడిసె కన్పడె. వారు బాధపడి సరే అని పెండ్లి చేసి మీ యింట్లో ఆ బిడ్డవద్దు మేము తోడుకొని పొతాము అని సెప్పి వారు తోడుకొనిపోయి ఆ దాసప్ప కొడుకుకు(అల్లునికి) అర్థ రాజ్యమిచ్చిరి. ఆ మీటకు వాళ్ళు బాగా బదికిరి.

దాసప్పే సచ్చి గుళ్ళ నక్కె పుట్టి కొడుక్కి యింత సగాయము సేసె అని ఊరంతా సెప్పుకొన్రని.

**అర్థ వివరణ :**

గుళ్ళనక్క = గుంటనక్క, యాడావి = ఏడావి (సంవత్సరం), ఆ మీటకు = ఆ మీదట, గుద్దిలి = గడ్డి, వేర్లు మొదలైనవి, పెల్లగించే ఒక పనిముట్టు, దోస ఇత్తులు = దోసవిత్తనాలు, దాంటిలో = దాంట్లో (దాన్లో), ఇడిసె = విడిచాయి, దుడ్డు = డబ్బు, గుళ్ళనక్కలు = గుంటనక్కలు, నన్ని = నన్ను, నగిరి = నవ్విరి, దినాము = ప్రతిరోజూ, సంగటి = రాగిముద్ద, పడుసు = పడచు, వచ్చేలేదు = రాము వస్చిడెస = వచ్చేసింది, సగాయము = సహాయము.

# 6. పేదరాసి పెద్దమ్మ

**సేకరణ :**

శ్రీ వి. వై. వి. సోమయాజి
తణుకు.

**కథ చెప్పినవారు :**

రమణమ్మ, వయస్సు 50 సం॥
కేతవరం, కొవ్వూరు తాలూకా,
పశ్చిమ గోదావరి జిల్లా.

అనగా అనగా ఒక ఊళ్లో పేదరాశి పెద్దమ్మ ఉందంట. ఆ పెద్దమ్మకి నలుగురు కూతుళ్ళున్నారంట. పెద్దమ్మ నలుగురి దగ్గరా తలొక మూడు నెలలు ఉంటూ కాలం గడుపుతా ఉంటదంట. ఒకసారి మొదటి కూతురింటినుండి రెండో కూతురి ఇంటికి పోతావుందంట. దారిలో పెద్ద అడివి. అడివిలో ఎల్తావుంటే ఒక పులి నరవాసన కనిపెట్టి వచ్చి పేదరాశి పెద్దమ్మని తినేత్తానందంట. పెద్దమ్మకి

బయం ఏసింది. బాగా ఆలోసించి పెద్దపులితో ఇలా అన్నదంట. పెద్దపులీ! పెద్ద పులీ నేను ముసలిదాన్ని, వళ్ళు అంతా చిక్కిపోయి ఉన్నాను. నేను ఇప్పుడు నా రెండో కూతురింటికి ఎల్తన్నాను. ఆళ్ళు బాగా ఉన్నోళ్ళు.అక్కడ పదిరోజులుండి గార్లు, మినప సున్ని ఉండలు, అరిసెలు తిని లావుగా బలిసి ఒత్తాను అప్పుడు తిందువుగాని. కమ్మగా వుంటది నా నెత్తురు అని చెప్పిందంట. దాని మాటలు పులి నమ్మి వదిలిపెట్టిందంట. పదిరోజులు అయినా పెద్దమ్మ తిరిగిరాలేదు. పులికి చాలా కోపం వచ్చింది. ఈదారి తప్పితే మరొకదారి లేదుగదా రాకపోద్దా నూద్దాం అనుకుందంట.

పెద్దమ్మ తన కూతురికి పులితో జరిగిన గొడవ చెప్పిందంట. మూడునెలలు వంతు అయిపోయాక పెద్దమ్మ బయల్దేరవలని వచ్చింది. కూతురు బాగా ఆలోచించి ఒక పెద్ద బానతెచ్చి అందులో పెద్దమ్మని కూకోపెట్టి మూత పెట్టి ఒక గుడ్డ గట్టిగా కట్టి దొర్లించి ఒదిలిపెట్టింది. బాన దొర్లుకుంటూ ఆడివిలోంచి పోతాఉంది. లోపలవున్న ముసలమ్మకి ఉషారువచ్చింది, ఇక పులి తనని ఏమీ చెయ్యలేదు అనుకుంది. సంతోషంతో "బానా బానా బాగా దొర్లు టమకాటు" అంటా పాడుకుంటా పోతావుంది. పెద్దపులి దగ్గర కొచ్చే టప్పటికి కూడ పాడతానే వుంది. పులి బానని ఆపి పంజాతో ఒక పెద్ద దెబ్బకొట్టింది. బాన భడేల్ మని పగిలి పోయింది. ఇంక పేదరాసి పెద్దమ్మకు బయం ఏసింది. మళ్ళీ బాగా ఆలోచించి పెద్దపులీ పెద్దపులీ |పయాణంలో నాఒళ్ళు అంతా చెమట పట్టింది గదా! ఆ చెరువులోకి వెళ్ళి తానం చేసి వత్తాను హాయిగా తిందువుగాని అంది. అప్పుడు పెద్దపులి సరే అని ఒప్పుకుంది. ముసలమ్మ ఎన్ని గంటలయినా చెరువులోంచి బయటకు రాలేదు. పెద్దపులికి కోపం వచ్చి ఎన్నోసార్లు పిలిచింది. ఒత్తన్నా ఒత్తన్నా అంటదిగాని ముసలమ్మ వత్తల్లేదు. పులికికోపంవచ్చిచెరువులో దిగి మీదకి దూకబోయింది. ముసలమ్మ నోట్లో ఇసుక పెట్టుకొని ఉంది. ఒక్క సారి పులి కళ్ళల్లోకి ఊసింది. పులి కళ్ళల్లో ఇసుక పడి మంటెక్కి బాదపడతా వుంటే ముసలమ్మ సంతోసంతో పారిపోయింది.

అర్థ వివరణ :

ఎల్తావుంటే=వెల్తూవుంటే, తినేత్తా=తినివేస్తా, నూద్దాం=చూద్దాం, బాన=కుండ, కూకోబెట్టి=కూర్చోబెట్టి, తానం=స్నానం, ఊసింది=ఉమి సింది (ఉమ్మింది).

# 7. అక్షయ పాత్ర

సేకరణ :

శ్రీ వి. వై. వి. సోమయాజి
తణుకు.

కథ చెప్పినవారు :

వరాలమ్మ, వయస్సు 60 సం॥
కన్నాపురం, పోలవరం తాలూకా,
పశ్చిమ గోదావరి జిల్లా.

అనగా అనగా ఒకూళ్లో ఒక పేదోడున్నాడు. ఆళ్ళ సంసారం గడవటం చాలా ఇబ్బందిగా ఉంటే అతని పెళ్ళాం ఒక రోజున కొన్ని మినపరొట్లు చేసి మొగుడికిచ్చి దార్లో ఆకలేసినప్పుడు తింటా పొరుగూరికెల్లి పని సంపాదించి డబ్బు పోగుచేసుకొని రమ్మని పంపింది. ఆ పేదోడు రొట్టెల్ని మూటగట్టుకొని అడివి లమ్మట పడిపోతావున్నాడు. దార్లో నిద్దరొచ్చి ఒక చెట్టుకింద పడుతున్నాడు. రాత్రి దేవకన్యకలు సరదాగా షికారుకు వచ్చారు. ఆళ్ళకి పేదోడి మినపరొట్లు గుమగుమ వాసనొచ్చాయి. ఆళ్ళు వాసన వచ్చిన దారంట వచ్చి పేదోడి పక్కలోవున్న రొట్టెల్ని పూర్తిగాతినేశారు. ఆడికి మెలకువచ్చి చూస్తే రొట్టెల్లేవు ఆడు ఏడుస్తా కూచున్నాడు. అప్పుడు దేవకన్నెకలు నాయనా ఏడవకు నీకేం కావాలో కోరుకో ఇత్తాం అన్నారు. ఆడు తిండికి లేక బాదపడుతూ పనికోసం ఎడుతున్నానని చెప్పాడు. దేవకన్నెకలు జాలిపడి ఆడికి ఒక అక్షయపాత్రనిచ్చారు. ఆకలేసినప్పుడు కావలసిన పిండి వంటలు తలుచుకొని, బోర్లిస్తే అవన్నీ వత్తాయని చెప్పారు. ఆ పేదోడు బోర్లించి చూశాడు. పంచభక్ష్య పరమాన్నాలు వచ్చాయి. పేదోడు ఆనందంగా అగిన్ని ఇంటికి పట్టుకెల్లి పెళ్ళానికి చూపించాడు. ఆళ్ళకి తిండికి లోటులేదుక దాని ఊళ్ళ వాళ్ళకి విందుచేద్దాం అనిపించి ఊరందర్నీ బోయినాలకి పిలిచారు. అందరూ ఎల్లాగ పెడతాడో చూద్దామని వచ్చారు. అందరికీ ఇస్తళ్ళు ఏసి గిన్ని బోర్లించుకుంటా ఎల్లుతుంటే పంచభక్ష్య పరమాన్నాలతో అన్నం పడింది. అందరూ ఆనందంగా తిన్నారు. చివర్న అది ఎల్లాగొచ్చిందీ అడిగారు, అప్పుడు పేదోడు జరిగిందంతా చెప్పాడు.

ఆళ్ళ పక్కింటి రాజమ్మకి ఆశవుట్టింది. మొగుణ్ణి పిల్చి రొట్టెలు మూటకట్టి పంపింది. ఆడుకూడ పేదోడు పడుకున్న చెట్టుకింద నిద్దర రాకపోయినా పడు

కున్నాడు. మామూలుగా దేవకన్నెకలు షికారుకు వచ్చారు. ఆళ్ళకి రొట్టిలు గుమాయించలేదు. ఆంచేత ఆళ్ళు తీసుకోలేదు. కాసేపు చూసి దేవకన్నెకల్లారా రొట్లు తెచ్చాను తినండి అని పెట్టాడు. ఆళ్ళు తినేశారు బాగోపోయినా. ఆళ్ళు తినెయ్యగానే నారొట్లు నాకివ్వండని ఏడుపు లంకించుకున్నాడు. ఆళ్ళకి కోపం వచ్చింది. తినమన్నది నువ్వేకదా అన్నారు. అయితే నాకొక అక్షయపాత్ర ఇవ్వండి పోతానన్నాడు. దేవకన్నెకలిచ్చారు. ఈడు కంగారుగా బోర్లించి చూసాడు. ఇద్దరు మంగలోళ్ళు పుట్టారు. ఒగడు మెడవంచి పట్టుకున్నాడు. రెండోవోడు నున్నగా గుండుగీసాడు. ఈ[illegible]ప్పకుంటా ఇంటికి పోయాడు. పెళ్ళాం కూడ ఏడ్చింది. ఆళ్ళకి జరిగిన పరాబవం అందరికి జరగాలని ఊళ్ళోళ్ళవాళ్ళని బోయినాలకు పిల్చారు అందర్నీ కూచోపెట్టి ఇస్తళ్ళు ఏసి గిన్నె బోర్లించుకుంటా పోయారు. అందరి ముందలా ఇద్దరేసి మంగలోళ్ళు పుట్టి మెడవంచి అందరికీ గుండుచేసి మాయం అయిపోయారు. ఈడు చేసిన పనికి అందరూ తిట్టుకుంటూ పోయారు. కత కంచికి మనమింటికి.

అర్థ వివరణ :

అడివిలమ్మట = అడవుల వెంబడి, ఎల్లుతుంటే = వెడుతూఉంటే ఇస్తళ్ళు=విస్తళాకులు, దారంట=దారివెంట బాగోపోయినా = బాగాలేక పోయినా, ముందల = ముందర, ఆళ్ళు = వాళ్ళు, రొట్లు=రొట్టెలు, బోయినాలు = భోజనాలు, ఎల్లుతుంటే = వెళ్తుంటే.

# 8. ఎత్తుకు పై ఎత్తు

| సేకరణ : | కథ చెప్పినవారు : |
|---|---|
| డా. జి.యస్. మోహన్<br>బెంగుళూరు | కుంటోబన్న, 60 సం॥<br>వడ్డె పాళ్యం, కళ్యాణదుర్గం తా॥<br>అనంతపురం జిల్లా. |

ఒక బిడ్డ ఒక కొడుకు. బిడ్డ్ని కుందుర్పట్లా ఊరిక్కిచ్చిండి. కుందుర్పి కట్లా ఊరికిచ్చింటే బిడ్డకి తల్లేమి చెప్పా అమ్మ! నా పాణం ఉండే వర్కూ తా పో. నా పాణము పోయిన్నాడు కూడ నీకు పుట్టిల్లుందను కొని రావద్దమ్మా

అని బిడ్డకి చెప్పా. అట్లే కాని ల్యామ్మా అనా బిడ్డ అదె ఎల్లిపాయ. బిడ్డకి ఇద్దరు కొడుకులుండ్రయి. సుమారు ఇట్లా ఎడపిల్లోరు. ఎడపిల్లోరైతే అక్కడ ఆయమొగుడు తీరిపాయ మొగుడు పొయ్యినంక ఇద్దరు సన్నపిల్లోరు. ఆయమ్మెకతి. ఇంటి తట్టుపూరా బండాటయ్యాయ బువ్వకి. బండాలైతే. పిల్లోరేమన్నీ అమ్మా పాళ్యములోన మా మామయ్యగారు ఉండారంటావు. వార్ని మాత్రము ఎడ్డీ ఒక్కటి అడగద్దు. ఊర్కే కడుపునిండా సంకటన్నా తినో పోము. రామ్మా అని తల్లికి అడగతా ఉండ్రడి. తల్లేమి సెప్పా అప్పా ఈ బద్దు పోదాము రేవు పోదాము అని దినుము దినుము సెప్పే సెప్పా ఆ బద్దు పిల్లోరేమిసేనిరి లేదమ్మా ఈ బద్దు పోయ్యే తీరల్లా అని తల్లిని ఆ కొడుకొక సెయ్యి పొట్టుకోని ఇగ్గుకోనే వచ్చి. తల్లిని ఇగ్గుకొనే వస్తే ఆపద్దు మామలేడు యావ్దోపల్లికి పొయ్యినాడు. వదినుండ్నే ఆ వదిని అన్న పెండ్లాము ఎద్లు తోలుకు పొయ్యింది. ఎద్లు తోలుకు పొయ్యింటే పగటాల కల్లా వచ్చినారు. వీళ్ళు మూగూను. ఇగ పగటాలకల్లావస్తే బీము ఉండ్నా? లేదు. ఎదమ్మా మామయ్యా అమ్మ సంగటాక్లవుతా వుందమ్మా ఎదమ్మా మామయ్య అని పిల్లోరు. అయ్యో వస్తారు వస్తారు అని తల్లి సెప్తావుంద బారుడు పొద్దు కల్లా వదిన ఎద్లుతోలొక్కొనొచ్చా. వాల్లపజీతి సూసా. అమ్మా అమ్మామ్మా కడుపునొప్పమ్మా, అమ్మో, అమ్మమ్మా కడువునొప్పమ్మా ఇంటా పర్లిచ్చా. అట్లే వంగొక్కొనేపాయ, ఎద్లు కట్టిడిశా. లోపల్కిపాయ. ఆ మూడు పొయ్యి గుండ్లను పీక్కొని కుండ్లమింది కేశా. అమ్మా ఇంక నేనేం చేస్తునమ్మ పాడింటి ఎలుకలొచ్చి పొయ్యిగుండ్లుకూడ మోస్కొని పోయినావి. ఇంకేం చేత్తమ్మా అని గట్టిగా ఏడుస్తా కూకోనా. ఇంకొంచెపు చూస్తుంది ఈయమ్మ, ఆ పిల్లోరంన్నేని. అమ్మా ఎడమ్మా మామయ్య సంకటాకలి అని అరస్తావుంటే అప్పా మీమామ ధాలేదు. ఇంగ పోదాము రాండప్ప అనిఇద్దర్ని రెట్లు పట్టుకొని తోడ్కొని కుందుర్పి దావకి పట్టా. సుమారు మన చెరువులో ఇంత పొయ్యినారు. మామయ్య వస్తా ఉండాడు. ఇది రామాయణము ఇన్నో రంతాను అప్పా మీ సెల్లిల్లు, మీ అల్లుండ్లు వచ్చిండ్రడీ. ఇగ రామ రామ అంటే నీ పెండ్లాము బువ్వ చెయ్యకపాయ. ఎలుకలు మోస్కొనిపాయ గుండ్లన్ని.

కడుపు నొస్తుందని అరసుకొంటా బువ్వసెయ్లా, వాళ్ళకు పెట్లా ఏడ్సుకుంటా సీసెల్లిలి, సీ అల్లుండ్లు ముగ్గురు ఏడ్సుకుంటా పొయ్యి అని సెప్రి. ఈయాలకి యాటికి పొయ్యింటారు అని ఆయప్ప వాల్లని అడిగా. ఈడే యాడో సెర్లోనే యాడో పోతారు పోప్పా అని.

అన్నేమి సేసా అట్లే పారిపాయ. అట్లే పారిపోతే ఆ కట్ట తావపాయ, సిల్లమ్మో అనా. ఆడేకూకోనా ఎడమ్మా మామయ్య అని పిల్లోల్లు. ఇగొప్ప ఆడొస్తాడు అనా. హత్తరకొచ్చేదంక ఊర్కే ఉండ్రి పిల్లోరు. హత్తర కొస్తానే మనిషికొ వాడోకాలు ఈడోకాలు పట్కోని మామా మామా సంకటము మామా, మామా మామ సంకటము మామా అంటే నల్గురూ ఏడ్సుకుంటా కూకోని. సూడన్నా సీ పెండ్లాము ఇట్లానా ఇంగేమిటికి రావల్లా అనా. అమ్మ నువ్వేమి రావద్దు. ఇగో ఈ జోబీలేద పదిరూపాయలు తీస్కో. ఇట్లే సీ ఊర్కిపో — రేపు మద్యాసము కల్లా మీ ఊరికి నేను ఒస్తాను పదమ్మా అంటాని సెప్పా, సెల్లెల్లి సాగిడిసా. అన్న ఇక్కడొచ్చా. రాత్రి పొండు కోనా. పొద్దున్నే పొద్దుగల్లే ఎద్లని తోల్కోనా గడ్డకు పాయ. మద్యాన్నం దంకా మేపోకోనా. తోల్కోనొచ్చా. ఇంటి ముంద్ర కూకోని తలకాయి వంకోని ఏడ్సుకుంటా కూకోనా, ఈయమ్మొగుడు. లోవుల్నించి పెండ్లామొచ్చా. అగా యాలట్లేడుస్తావు. యాలయాల అనా. ఏమిలేదు. మా అత్త మామింటికి అగ్గిపడి కాలిపాయినంట. మున్నాళ్ళాయనంట. మా యత్తకి సంగటిలేక అడ్డము పడిందంట నేనింకా యాటికోస్తు యాటికిపోదు అని గట్టిగా అర్సిడిసా మొగుడు. ఎవర్రనంటే ఇగో ఈ రాజప్పనా, ఈ యప్పనా అన్న మొగుడు పెండ్లాముతో అనా. అయ్యో నా పుట్నిల్లే కాలిపాయనంటే నా పుట్నింటి మీద నా మొగున్కి ఎంతాశ ఉందని పెండ్లాము ఏడ్సుకుంటా కూకోనా. ఏమే ఏమన్నా ఉంటే నాల్లు మూట్లేయే మాయత్త కూడ్లేక వరిగిపోయే పొద్దాయ. సూడు ఈ నాలుగు మూటల బియ్యమిచ్చి మా యత్తని మాట్లాడ్కోనన్నా వస్తానని పెండ్లాముతో సెప్పా. అవునో కామో అనా నాలుగు పల్లాలు బియ్య మిచ్చా, రెండు పల్లాలు వడ్లేసా. మొగిన్ని కానకుండా ఒక మూటకు రూపా యిల్ని కుట్టి దానిపెట్టిండా. ఇగో ఇది మాయమ్మకి తోల్కుపో ఈ ఇచ్చిరాపో

అనా. ఏంటిదిది అనడిగా మొగుడు. ఉలవలు నింపినాను అనా పెండ్లాము. అట్లేకానీలే అనా అన్నీ బ త్రీసేసుకోనా. నెట్టుగా కుందిర్సిదావ పట్కోనా బండ్లో పాయ సెల్లెలికన్నీ కెడిపా. సరైనా గడిసిలుండ్లా సెల్లెల్లి. అమ్మా ఈ గుటిసంతా వీకి గనమైన మిది కట్టమా. ఇగో నూడు ఇన్నూరు రూపాయలనా అని అల్లుండ్లికి సెల్లెలికి ఇచ్చిడిసా. లే గనమైన మిద్ది కట్టండ్రా అనా. కాన్లే మామా అ(ని. ఇదె కట్టదైతే బండ్కి, ఎదుల్కి ఇంకాలా దుడ్లు. లే ఏద్లు ఈడే సాయ్యి, ఈ బండి ఇక్కడే ఇరిగిపోనీ గనమైన మిద్ది కట్టండలే అని సెప్పా ఆ ఎద్లు, బండి ఆడే ఇడ్సిడిసా వచ్చా. మద్యాహ్నానంకల్లా వచ్చిడిసా. లోపల పెండ్లాముందా. ఎలుపుట ఇంటిముంద్ర కూకోని ఊర్కే ఏడ్సుతా కూకోనా. లోపుల్నింటి పెండ్లామొచ్చా. అగ్గా ఎప్పొచ్చిడొస్వి నువ్వుఅనా. ఎద్లుబండి ఎక్కడపాయ, ఎబుడొస్తివ్వి అనా. కాదే నేను ఈ సెర్వులోన ఆ మాన్లుతాన సెంబు తట్టుకూకోనింటి. సెంబు తట్టు కూకోనింటే, ఆలే గద్లొచ్చి బండిని, ఎద్లుని కూడ పొట్కోని అదేపాయ ఇంగనేనేమి సేస్తు అనా. అతా అరా అనా ఈ సోగలోడు మాట్లాడేది సూస్తురు రండన్నా అని ఇట్లా వోరిని, నీయట్లావోరిని అందర్నీ ఆటికి పిలిశా. ఏమండన్నా అంతింతలావు ఎద్దుల్ని, బండ్ని ఎక్కటన్నా ఆలేగద్లు ఎత్కపోయినేమన్నా. అక్కడుండే వోరంతా యా అబ్బురవ్వా ఇది ఎక్కడన్నా అలేగద్దు అంతలావు ఎద్దుల్ని ఎత్తుకుపోతుందా, అని వచ్చే వోరంతా అ(ని. ఈ యప్పది తొప్పాయ అ(ని. సరేనన్నా మీరేమో బాగా చెప్తారు కదా. ఇంతింతలావు పొయ్యిగుండ్లు ఏసింటి కదా పొయ్యికి. ఇంతింతలావు పొయ్యిగుండ్లు ఎలుకలెట్లా మోస్కపాయ. ఓ ఇదీ అపద్దమే. మరి ఎలుకు మోస్కపోయినట్లే ఎద్లు, బండ్ని ఆలేగద్లు మోస్కపోయా అనా. అట్లా రా దావ్క అనా.

**అర్థ వివరణ:**

ఎదపిల్లోరు = చిన్నపిల్లలు, బండాట = ఇల్లు జరగడం కష్టమయ్యిందని అర్థం, ఇగ్గుకొని = ఈడ్చుకొని, యాద్దో = ఏదో, పగటాల = పగటి వేళ (ఉదయమే), పజీతి = ఇబ్బంది. కష్టం. ఆడే కూకోనా = అక్కడే

కూర్చొన్నాడు, ఏడమ్మా = ఏడి అమ్మ, ఇగొప్ప = ఇదిగో అప్పా, హ[illegible] దగ్గర (కన్నడ పదం), సాగిడిసా = పంపించివేశాడు, ఇన్నోరం[illegible] బెన్నవాఘ్నంతాను, వంకోని = వంవుకోని (వంగి), యాల = [illegible] అర్సిడిసా = అరిచివేశాడు (అరచాడు), నెట్టుగా = నేరుగా, గుడిసిలు[illegible] = గుడిసిలిలేదు. (గుడిసె లేదు), ఏలుపుట = వెలుపల (బయట), ఏబుడొ[illegible] ఎప్పుడొచ్చావు, ఆలేగడ్లు = దేగలు, అబ్బురవప్పా ఇది = అబ్బురం ఇది, తొప్పాయ = తప్పయింది.

చుట్టూ రా ఆవరించుకొని ఉన్న
చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం
కంటే ఎంత చిన్న దీపాన్నయినా
వెలిగించడం మేలు.

తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాలవైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషిచేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3